SREE
# KANTAMATHI



# కాంతామతి

( ఐదంకముల నాటకము )

గ్రంథకర్త:

సంపూర్ణ రామాయణము, పురూరవ, సీతాకళ్యాణము, మారుతివిజయము
మారుతీమైరావణసంగ్రామము, జగన్మోహన, పద్మినీలోకబాంధవము,
ఇత్యాదినాటకకర్తయగు,

.గూడూరు కోటీశ్వరరావుగారు.

రెండవ కూర్పు 1000 ప్రతులు.

పబ్లిషర్సు:

కందుల గోవిందము,
బెజవాడ, కృష్ణాజిల్లా.

రైతు ముద్రాక్షరశాల, తెనాలి

1924



[వెల 0—12—0

[illegible]

(గ్రంథకర్త [illegible])

ఇందు శూరసేనుని దండగములు, కమలాదేవియొక్క ప్రేమము, శూరసేనుని పరితాపము, పల్లెవాండ్రయొక్క హాస్యసంభాషణము, కమలసేనునికోర్టు ఈనాటకము అనేకచోట్ల ప్రదర్శించి ప్రఖ్యాతిగాంచె నాటకరాజము చక్కనిపాటలుగలవు. నేడే [illegible].

వెల 1—4—0 మాత్రమే.

## గ్రామఫోను హాస్యపుపాటలు.

(గ్రంథకర్త వల్లూరి జగన్నాథరావుగారు.)

ఇందు కోడిపాట, లంజపాట, గోంగూరపాట, మొదలగునవి ముప్పదిరెండుపాటలుగలవు. ఈపాటలచ్చటచ్చట గ్రామఫోనులో దేశమంతటను ప్రఖ్యాతిగాంచినవి. ఈపుస్తకము చదువుచున్నవ్వాడు, నవ్వము, అని వ్రతముపట్టినను నవ్వురాకమానదు. వెలస్వల్పము ఫలమధికము.

వెల 0—6—0 మాత్రమే.

## సంగీత లంకాదహనము.

(గ్రంథకర్త ద్రోణంరాజు సీతారామారావుగారు.)

ఇందు శ్రీరామలక్ష్మణులు సీతకై వెదకుట, హనుమత్సుగ్రీవుల చెలిమిచేయుట, వాలిసంహారము, రావణాంజనేయుల సంవాదము మొదలగు సంగతులతో ముద్దులమూటగట్టు పద్యములతో చక్కని కీర్తనలతో ముద్రింపబడిననాటకము. వెల 0—10—0 మాత్రమే.

వలయువారు:—

కందుల గోవిందము,
బెజవాడ.
(కృష్ణాజిల్లా)

SREE

# KANTAMATHI.

# కాంతామతి

(ఐదంకముల నాటకము.)

గ్రంథకర్త:

సంపూర్ణ రామాయణము, పురూరవ, సీతాకల్యాణము, మారుతివిజయము,
మారుతీమైరావణ సంగ్రామము, జగన్మోహన, పద్మినీలోకబాంధవము,
ఇత్యాది నాటకకర్తయగు,

గూడూరు కోటీశ్వరరావు.

రెండవకూర్పు 1000 ప్రతులు.

పబ్లిషర్సు:
గూడూరు ప్రచురణాలయము,
జి. టి. ఆర్. వేజండ్ల.
గుంటూరు జిల్లా.

రైతు ముద్రాక్షరశాల, తెనాలి.

1924.



(వెల 0—12—0

# పీ ఠి క.

సోదరులారా!

నేను రచించిన నాటకములలో నీకాంతామతి యారవయది. తక్కిన యైదు నాటకములందు నాల్గుమాత్రము ముద్రణమై తమసాన్నిధ్యమున కేతెంచియేయున్నవి.

ఐదవనాటకమగు అహల్యాశాపవిమోచనము కొద్దిరోజులలో ముద్రణమై భవత్సాన్నిధ్యమునకు రాగలదని విన్నవించుకొనుచున్నాఁడ. ఈకాంతామతినాటకము కొందరు స్నేహితుల ప్రోత్సాహముచే వ్రాసియ (22 సం|| 18 అగస్టున) ప్రారంభించితిని. పిమ్మట వ్యాధిగ్రస్థుఁడనై మూడుమాసములీ గ్రంథముందిలకించనశక్తుండనైతి. (22 సం|| 4వ నవంబరుకు) కొంచమారోగ్యస్థితి గల్గుటచే మరల నారంభించి నాశక్తి కొలఁది వ్రాయుచు ఎట్టకేలకు ముగించినాఁడ.

శరీరమనారోగ్యదశయందుండి వ్రాసిన నీగ్రంథమును వెంటనే ముద్రింపవలసి గూడవచ్చెను. కానియెట్లైనసరియేయనిఁ దలచి వెంటనే ముద్రాక్షరశాల కనిపి ముద్రణమొనరించినాఁడ. పండితాగ్రేసరులగు సుధీజనులెల్లరు నిందుగల తప్పులను మన్నింతురుగాక యని ప్రార్థించుచున్నాఁడ.

ఇందలిలోపములున్న ద్వితీయముద్రణమున సవరించుకొందునని విన్నవించుకొనుచున్నాఁడ.

ప్రదర్శకులగు నాసోదరులారా! ఈనాటకముఁ బ్రదర్శించునపుడన్యవిరచితములఁ జేర్పకయు, ఇందలి భాగములఁ బీకకయుఁ బ్రదర్శింతురుగాకయని ప్రార్థించుచున్నాఁడ.

వేజండ్లు, 1—1—1923.

గూడూరు కోటేశ్వరరావు.
గ్రంథకర్త.

## ద్వితీయ ముద్రణము.

సోదరులారా!

ప్రథమముద్రణప్రతులన్నియు నాల్గుమాసములలోనే చెల్లిపోయినవి. కాని నాటినుండి ద్వితీయముద్రణము ముద్రించుటకు ప్రయత్నించనైతిని. ఏలనన పురూరవాది నాటకముల ముద్రించవలసిన తొందరగల్గుటచే నేటికి రెండవకూర్పు ముద్రింపించి మీకరము లలంకరింపజేయుగల భాగ్యమబ్బుటచే సంతసించుచున్నాడను.

భారతీయులారా! ప్రథమముద్రణమందు జూపిన యాదరణమీద్వితీయముద్రణమందుగూడ జూపవేడుచున్నాఁడ.

వేజండ్లు, 1—8—24.

జి. కోటేశ్వరరావు.
గ్రంథకర్త.

# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు

పురుషులు

ప్రతాపసేనుడు:—కథానాయకుడు
కొండభట్టు:—ప్రతాపసేనుని గురువు
ఉత్తమశీలుడు:—వైశ్యుడు
దుష్టబుద్ధి:—మహాపాతకపురపు రాజు
మహాపాపి, అనృతవాది:-దుష్టబుద్ధి మంత్రులు
మహానీచుడు:-దుష్టబుద్ధి సేవకుడు
దొంగ
1, 2 రాజకుమారులు
సేవకుడు

స్త్రీలు

కాంతామతి:-ప్రతాపసేనునిభార్య-కథానాయిక
కాంచనమాల:-ప్రతాపసేనుని వేశ్య
రత్నమాల:-వేశ్యదాసి
చంద్రరేఖ:-కళింగరాజ పుత్రిక
కొందరు దాసీలు, మరికొందరు వేశ్యలు



శ్రీ

# కాంతామతి

## ప్రస్తావన.

---

[ ప్రవేశము: నటుడు. ]

శా॥ శ్రీరామామణినెప్డు తానురమునన్ • జెన్నొందగాదాల్చిబల్
గారామొప్పగ మౌనిబృందముల భ•క్తశ్రేణి రక్షింపుచున్
క్రూరాత్ముల్ గడుతుచ్ఛమానసుల ను•న్మూలంబుగాఁ జేయుచున్
బేరుంగాంచిన విష్ణుమూర్తియితడున్ • బెంపారు నైశ్వర్యముల్॥

ఇంకను నటిరాకున్నదే? నటీ! యిటురమ్ము.

( ప్రవేశము: నటి )

నాథా! సెలవు?

నటు—నేఁడు నూతనముగాఁ జేయఁబడిన కాంతామతి నాటకముఁ బ్రదర్శించవలెనుగదా? నటకులు సిద్ధముగనుండిరా?

నటి—సిద్ధముగనేయుండిరి. మనమును త్వరపడవలయును.

నటు—చెలీ! ఇంకఁ జాగుసేయక నీ గానకళా నైపుణ్యముఁ జూపియించుకంత సంతసింపజేయుము.

నటి—ఏఋతువును గురించి వర్ణింతును?

**నటు**—పోనిమ్ము. ఋతువువలదు లెమ్ము. ఇపుడురాగల కుంతలదేశా ధీశుండగు ప్రతాపసేనుని యాస్థానమును వర్ణింపుము?

**నటి**—ఆర్యా! ఆతనికొక యాస్థానముగలదా ? వేశ్యయగు కాంచనమాలాలోలుఁడై సర్వమునునావెలయాలికి ధారవోసినవానికి యాస్థానమేడ? నేను వర్ణించుటేడ? ఈ పండితమండలి ప్రోలవాని నుచ్చరింపదగునా? ఐన నేమనెదరు!

**నటు**—ఐన వలదు లెమ్ము. ఇప్పటికే నడురేయి గావచ్చినది. యింక మనము కర్తవ్య మాచరింతము రమ్ము.

**నటి**—చిత్తము. నిష్క్రమింతురు

ఇది ప్రస్తావన

---



శ్రీ

# కాంతామతి

## ప్రథమాంకము.

—:0:—

ప్రథమరంగము: కాంచనమాల సౌధము

( ప్రవేశము: కాంచనమాల, కొందరు సఖులు )

( అనుబంధము 1 )

నేటికి మూడు దినములనుండి నా విటుడగు "ప్రతాప సేనుడు" రత్నమాలయింటి కేగుచుండెనని వినియుంటిని. ఐన నేమిలే. ఆతడు నేనన్న ప్రాణముల విడుచునుగదా? నేవైన రాకయుండునా? వచ్చినతోడనే మాకున్నవృత్తిరీతిగా నాతని నిరాకరించియు, బెదరించి యుంజూచెద. యీప్రతాపసేనుడు నాపైగల మోహముచే జీవా ల్లైనను దినును. చెప్పుదెబ్బ లైనను దినును. ఇందులకు సందియములేదు

ఆహా! మోహమెంతచెడ్డదీ? ఎట్టి పురుషసింహునివైనను పదదాసు నిగ జేయునుగదా? ధనాధిపునివైనను సేవకునిగఁజేయునుగదా? ఈ ప్రపంచమున పురుషులన స్త్రీలచేజిక్కిన కీల్బొమ్మలవంటివారు. ఇందుల కేమియు సందియములేదు. సఖులారా! మీరిప్పుడే నందనోద్యానముకుంజని విరిసిన ప్రసూనములఁ గొనితెండు. ఆలసింపకుడు. ప్రతాపసేనుడు వచ్చువేళ సమీపించినది. ఇకపొండు. శీఘ్రముగ దిరిగి రండు.

సఖులు॥ అమ్మా! పోయెదముగాని బావగారువచ్చిన నెట్లుగా సంచరించెదవో? వానికి బుద్ధివచ్చునట్లొనర్పవలయు. మేమిదే పోయి వచ్చెదము.

కాంచ॥ మంచిది పోయిరండు. (సఖులు నిష్క్రమింతురు)

గీ॥ వలపులకు బట్టుకొమ్మ మా • వారకాంత
మాయలకు పుట్టినిల్లు, మా • మానినులిల
రోగముల కెల్ల మూలంబు • రోకులంబు
యిట్టి మమ్ములఁ జేపట్టి • యేగగలరె?

మరియు

ధనదుని నిరాకరించెడి • ధనికు నైన
సర్వవిద్యలు నేర్చిన • సరసు నైన
మహాడురోజుల నిరిపంపు • ముద్దుజూపి
సర్వమును సున్న జేయదే • సానిపొందు॥

ఇంక నేజెప్పఁబనిలేదు. మా వేశ్యలఁగూర్చి ఇదివరకే యనే నాటకము లాడుచుండిరి. ఐనను మా వేశ్యలు బహు మాయలమారులు. కపట ప్రేమధారులు. అనృతవాదులు. వేయేల? సర్వము మీకే దెలియు. ఇంక రూపలావణ్యములన్న మిసమిసలాడెడి మేడిపండువలెనై పసందులచేతను, కన్ను సైగలజేతను, లేనిపోని వేషభాషల చేతను విటులను లోబరచుకొను ప్రజ్ఞ సర్వరక్షకుండగు నాభగవంతుఁడు మా కులమున కొసంగెను. (లోనకుఁజూచి) ఎవ్వరో వచ్చుచున్నట్లున్నది. ప్రతాపసేనుడేనా? ఆ అతడే, నేనింక కోపదృష్టిగలదానివలె నిందు శయనించెద.

(అని నేలపై ముసుగుతో శయనించును.)

(ప్రవేశము: ప్రతాపసేనుడు) (అలంకృతుడై)

నాముద్దులగుమ్మ, నా వలపులకలికి, నా మనోహారి, కాంచనమాల, ఏది? కాన్పింపకున్నదే? కాంచనమాలా! కాంచనమాలా! (క్రిందజూచి) ఓహో! ఏలయిట్లు భూశయ్యపై శయనించియున్నది? కారణ మేమైయుండును? నాపై కోపగించి యిట్లొనర్చియుండెనా? (దగ్గరజేరి) ప్రియకాంతా! కాంచనమాలా!

(అనుబంధము).

కాంచ॥ (దిగ్గునలేచి) ఎవరు నీవు? నాసౌధమునకు రాగతమేమి? అవలకుంబొమ్ము.

ప్రతా॥ కాంచనమాలా! ఏమిది? యిట్లుబల్కెదవు? నేప్రతాపసేనుఁడ గానా? చూడుము.

కాంచ॥ నీవు ప్రతాపసేనుఁడవైన నాకేమిలే. పొమ్ము. నేటికి మూడు దినములనుండిలేని కాంచనమాల నేడు గావలసివచ్చినదా? చాలు చాలు నీకథయంతయుఁ దెలసినది.

ప్రతా॥ ఏమిది? ప్రేయసీ! కాంచనమాలా నేడేమొ వింతగఁబలుకుచుంటివి.

కాంచ॥ ఔను! అంతయు వింతగనేయుండును. రత్నమాలతో స్నేహముఁగూడ వింతగ నుండదా?

ప్రతా॥ రత్నమాల? ఎవ్వరు? స్నేహము? ఎవరు జేసిరి?

కాంచ॥ ఎవ్వరో యననేల? నేటికి మూడు దినములనుండియు రత్నమాలాలోలుఁడవైయుండుటెరుంగమా? పిల్లికనుమూసి పాలు ద్రావుచుండుట ఎల్లవారు జూచుచునేయుందురు. ఇంక నాతోడ మీకుఁగావలసినదేమిలే! పొమ్ము. రత్నమాలయే నీ కాంత.

ప్రతా॥ ప్రాణప్రియా! చెప్పెద వినుము. నేటికి మూడుదినములనుండియు నీకడకు రాకుండుటచే నీకిట్టియూహగల్గినది. కలిగిన కల్గవచ్చుగాక. నాగురుప్రుగారు వచ్చియుండుటచే నాకు రావలను బడినదిగాదు. ఇందులకు వేరుగ నెంచకుము.

కాంచ॥ రావలనుబడని కార్యమేమి జేయుచుంటివి?

ప్రతా॥ కొన్నివిషయములు మాట్లాడవలసి ముచ్చటించుచుంటిమి.

కాంచ॥ ఏమివిషయములఁగూర్చి. నన్నుగూర్చియేనా?

ప్రతా॥ కాదు కాదు. రాజ్యాంగమునుగూర్చి ముచ్చటించుచుంటిమి. నీవిషయ మచ్చట యేలదేవలయు?

కాంచ॥ నావిషయమై యేమియు ముచ్చటించలేదా ఇందసత్యముఁ బల్కితివి ?

ప్రతా॥ కాదుగాని నీవిట్లుండ బాడిగాదు. "వివాహమునర్పుకొనుము" అని బల్కినాఁడు.

కాంచ॥ అందులకేమని మారుబల్కితివి?

ప్రతా॥ నాకు వివాహమెందుకు, వలదని బల్కితిని.

కాంచ॥ నిజముగ నిట్లు బల్కితివా? కల్ల. నమ్మఁజాల.

ప్రతా॥ ప్రేయసీ! ఇంకను నాయందునీకు నమ్మకము కల్గలేదుగదా ?

చం॥ కలికి! మిటారి నామతిని • గన్గొనవైతివి నిన్నుబాసి నే
నిలువగనేర్తునే? క్షణము • నిక్కముపెండిలియాడ నింక నీ
గలసియు సర్వసౌఖ్యములు • గాంచెదనంచు దలంచుచుంటి నో
జలజదళాయతాక్షి! విను • సౌఖ్యము స్వర్గము నీవె నాకిలన్॥

రమణీమణీ! నీకన్న నాకెక్కుడుగల వస్తువు నెందుజూచినను గాన్పింపదయ్యె. నిన్నుజూడని నిముషమొక యుగముగనుండును. అట్టి నిన్నుబాసి నే బ్రతుకగలనా?

కాంచ॥ ఏటికిబల్కెదవు ? ఇది నిక్కమా ? ఒక్కటిదెల్పెద వినుము.

ఉ॥ కాముకులైనవారు తమ • కార్యముదీరిన యంత దాని న
మ్మోముమను జూడకుందురను • ముందటిసుద్దులు మేమెఱుంగమే ?

ప్రతా॥
కామిని! యేలయిట్లనెదు ? • కాముకులెల్లరు నట్టిజేతురా?
స్వామియెఱుంగు నామతము • భావమునందున వేరుసేయకే॥

ప్రాణేశ్వరీ! నీరూపమే నాకానందము. పరమానందము. బ్రహ్మానందము. నీకన్న నాకెక్కుడు లోకమెయ్యది? సర్వకాల సర్వావస్థలయందును నిన్నుదక్క నన్యస్త్రీని ప్రేమించియుఁ దలంచియు నెఱుంగను. ఇఁక ముందును దలంచను. ఈమాట నమ్ముము.

(తెరలో) మహారాజ్ సలామ్.

ప్రతా॥ సేవకా రమ్ము.

[ప్రవేశము. సేవకుఁడు]

సేవ॥ మహారాజ్ సలామ్.

ప్రతా॥ ఏమిరా విశేషములు?

సేవ॥ క్యాబీనై మహారాజ్ నిన్నవొచ్చివుండలేద్ ఓబుఢీబులాతాహై

ప్రతా॥ నిన్నవచ్చివుండిన దెవ్వరురా? (అని ఆలోచనఁ జేయును)

సేవ॥ తెల్సిందినై మహారాజ్ మోటాలకిడీపకట్కో ఆయానీ! బుఢీ ఉనుఆయా జరూర్సె ఆప్ వుసో.

ప్రతా॥ నాకొరకై ఇప్పుడు వచ్చువారెవ్వరు ? సేవకా! ఎవ్వరు తెలియకుండఁజెప్పెదవు.

సేవ॥ మాలుంనైక్యా అది అది కొండ కొండ క్యాకి ఆతానీ అంకు కలి ఆయానీ బుఢీ ఉను ఆయా అబ్ మాలుంహై.

ప్రతా॥ ఓహో ! గురువుగారగు కొండభట్టుగారా?

సేవ॥ ఆ ఉన్ గురు కొండభట్టు

కాంచ॥ సేవకా ! గురు వైననేమిలావా ? యిప్పుడు వచ్చుటకు వలను గాదనిఁదెల్పుము పొమ్ము.

సేవ॥ నై రో తుంకు బులాయనీ, క్యా మహారాజ్ ఆతానీ?

ప్రతా॥ సేవకా! నేనిదేవచ్చెద నీవు గురువుగారికడకు జని వారికి వలయు సామగ్రులనిచ్చి నానిలయమందే యుండునట్లుఁజేయుము.

సేవ॥ అచ్ఛా! (తనలో) కాంచనమాలా సైతాన్ వైసాకరే? అబ్ హం క్యాదిస్తా? ముందు వుండది ముస్సళ్ళపండ్గ. అబిక్యాహై.

(అని నిష్క్రమించును)

ప్రతా॥ మనోహరీ! కొండభట్టుగారు వచ్చియుండిరి నేనింక వారి దర్శింపఁబోవలెను. సెలవా? ఇప్పుడే వచ్చెదను.

కాంచ॥ ఏమి గురువు నాకన్న నెక్కుడగునా?

ప్రతా॥ ఎక్కడైనను గాకున్నను కులగురువు గదా ? దర్శింపకుండు టెట్లు?

కాంచ॥ నీవిప్పుడు పోవలదు

ప్రతా॥ పోయిననేమి ? ఒక్క నిముషములో వచ్చెదనుగదా ? ఏమందువు ?

కాంచ॥ అట్లయిననేను రెండుసంగతులఁగోరెద నవి యిచ్చెదనని యానఁబెట్టి పొమ్ము.

ప్రతా॥ నీకేవేళనైన నడ్డుజెప్పియుంటినా ? సర్వ వ్యవహారములయందును నిన్నే ప్రధానమానిసిగ నెంచితినే.

కాంచ॥ అట్లుగాదు. నీగురువెంతబోధించినను వివాహమున కంగీకరించకుము. నీవట్లొనర్చితివేని నే ప్రాణపరిత్యాగము జేసికొనియెద.

ప్రతా॥ (పట్టుకొని) ఆ. ఎంతమాట. అట్లుజేయకుము. నీయాజ్ఞ మీరువాడనా ? నీవు వలదన్న వివాహ మేలజేసికొందును ?

కాంచ॥ రెండవది నీకుఁగల రాజ్యములోని సర్వాధికారములు నాకొసంగవలయు.

ప్రతా॥ అట్లనే యొసంగితి గైకొనుము.

కాంచ॥ అది మాటలతోఁగాదు క్రియలతోఁగావలెను.

ప్రతా॥ ఐన నేమందువు ?

కాంచ॥ నీవ్రేలియుంగర మిట్లిమ్ము.

ప్రతా॥ ఇదిగో గైకొనుము. (అని యిచ్చును)

కాంచ॥ అప్పుడేఅయినదా ? నీకు నేనే రాజును నాయాజ్ఞమీరక నీవు నడచుకొనవలెను. ఇందులకు సమ్మతింతువా ?

ప్రతా॥ ప్రాణప్రియా ! నీయాజ్ఞకు మారుబల్కుదునా ? నీవెట్లొనర్పమన్న నట్లనే యాచరించెద, ఇందులకు సందియము లేదు. సెలవా ? నిముసములో మరలివచ్చెద.

కాంచ॥ నేజెప్పినది మరచెదవా ?

ప్రతా॥ ఏమది?

కాంచ॥ వివాహామువలదని.

ప్రతా॥ నీయాంజ్ఞోల్లంఘమున మొనర్చి వివాహ మొనర్చుకొందునా? వివాహ మొనర్చుకొన్నను ఇంతకన్న నెక్కుడుసౌఖ్యముగలదా?

(ప్రవేశము: సేవకుడు)

మహారాజ్ సలామ్

ప్రతా॥ ఏమురా మరలవచ్చితివి?

సేవ॥ ఉన్ బులా తాహై మహరాజ్

కాంచ॥ సేవకా ఆయన ఎందుల్లకై వచ్చినాడు?

సేవ॥ అంకు క్యామాలుం ఆయాతో ఆతా నైహితో నైహి ఫిర్ జాకో బుఢీకు అంతా సెప్తాం అమార ఖజాన క్యాజాతే!

ప్రతా॥ సేవకా రమ్ముపోవుదము (నిష్క్రమించును)

కాంచ॥ ఒక వైపునకు నిష్క్రమించును

సేవ॥ కాంచన్ మాలా మాటల్కి యిని ఖజానా అంతా ఖరుసు పెట్టి ఫేల్తాహై అబ్ మాలుం ఇంతయింత పెద్దరాజుల్కి సూసిఉండాంలేదు మాయమాటల్ సెప్తే మాకితెల్వదు ఏం? అంకుక్యా దస్‌రూపీ దర్మేవాలాకు బడయి కారణఎందుక్కు కాంచన్ మాలా ధోక్లే అయ్యగార్కి బుట్టలోపెట్టింది అంకు సాబ్బీమాలుం కాంచన్‌మాలా మిందనుమ్ముపడ ఉన్‌ఖర్చు అకోజాకో బులానేకా. మర్జాతుం రేమై మారాజు యింకఉంటాడుఏం. కాంచన్ మాలాయేసిన ధంకాపలాన్! రాజుకొంప ఖళాస్,

(నిష్క్రమించును)

ద్వితీయ రంగము: ప్రతాపసేనుని యాస్థానము.

(ప్రవేశము: ప్రతాపసేనుడు, కొండభట్టు.)

ప్రతా॥ ఆచార్యా! ఏల మీాకీపట్టుదల? మీారెన్ని జెప్పినను నామనమున కెక్కదు. ఎందుకిట్లు బోధించెదరు?

కాంత॥ ప్రతాపసేనా! వేశ్యకాంత నీకు శాశ్వతమా? సరివారువిన్న నగుబాటుగాదా? కులమునకపకీర్తిరాదా? యశంబుపోదా? వివాహంబొనర్చుకొమ్మని నిక్కచ్చగఁ బల్కుట వాదా? చాలు చాలు నీ వెడగులు. వివాహంబొనర్చుకొనుము.

(అనుబంధము 3.)

ప్రతా॥ గురువరా! వేశ్యనుంచుకొనుటతప్పా? ఇపుడిమిపై నెంద రెందరు వేశ్యాలోలురైయుండలేదు? నీవుమాత్రము నంగ నాచివా?

చం. తలయును గడ్డమున్నరిసి • తావసిరిశిగ నేటికుంటి వీ
వలబలమున్న యత్తరి వి • టానళిప్వృత్తి వహించలేదె? యా
జలజదళాక్షులఁగలసి • సౌఖ్యగతిఁ జెలియించలేదె? నే
బాలఁతిని కాంచనామణిని • బొంది సుఖించగయోర్వవైతివా!

చాలుచాలు సుస్త్రీప్రసంగములు నాకడజెప్పకుఁడు. ఇంక నేవిను వాడగాను.

కాంత॥ (తనలో) ఓహో! తొండముదిరియూసరవిల్లియైనదే. నేను నీతులుదెల్ప నన్నే నిరాకరించుచున్నవాఁడు. యింక నితరులు దెల్పిన నీతడువినునా? (ప్ర) ప్రతాపసేనా! శాంతించుము ఇంకనొక్కటిదెల్పెద మనమున యోచించుకొనుము.

ఆ. వారకాంతఁగూడ • వైభవంబేనని
దలఁచుచుంటివీవు • ధరణిలోన
దుర్యశంబు గల్గెదో • యని యోచన
బొడమదయ్యె నీకు • బుద్ధిలోన.

ప్రతా॥ అయ్యా! వినుడు ఆకాంచనమాల మాటయే నాకు వేదాక్షరంబు దానియాజ్ఞయే నాకుజీవనముగాన దానియనుమతిలేక వివాహంబొనర్చుకొనజాలను క్షమింపుడు.

కాంత॥ ఓయిపిచ్చివాడా! వేశ్యమాటవిని వివాహనుబొనర్చుకొనని వెఱ్ఱివాడీలోకమునగలడా? వివాహకబొనర్చుకొనినగదా

పుత్రపౌత్రాదులుగల్గుట? దానివలనగదా వంశాభివృద్ధి? దాని వలననేగదా సర్వసౌఖ్యములు? దానివలనగదా యశశ్చంద్రిక నలుదిక్కులఁ బ్రకాసించుట? నీసరిరాజులువిన్న నీయెడగౌరవ ముండునా? ప్రజలకుప్రభుభక్తియుండునా? జన్మమునకుమానాభిమానంబులుండవలదా? కీర్త్యపకీర్తులుదలంచవలదా!

ప్రతా॥ గురువరా!

ఉ. మానముపోవుగాక యభి • మానముగల్గినగల్గుగాక నా
ప్రాణముపోవుగాక మరి • ప్రాభవమంతయు వీడుగాక నా
భానుఁడు త్రోవఁబోక హిమ • భానుఁడు వేడిమిబూనుగాక నా
మానినిపొందు వీడుటను • మాట నసత్యము చేయునేటికిన్.

కావున కాంచనమాలతో నేనింక వివాహమాడనని, బాస యొనర్చినాఁడ. అట్టివాడ నేనెట్లుగా వివాహమాడుదును? మరియు, కాంచనమాల యెట్లుజెప్పిన యట్లనేరిననలసినది. కాని అన్యథాచరించ వలనుఁబడదు. నాయందుదయయుంచి ఎన్నువివాహమాడుమని మీరు నిర్బంధించకుఁడు.

కౌండ॥ ప్రతాపసేనా! మీ దెరుంగక జరించెదవా? పిన్నపెద్దలని గుర్తెరుంగక సంచరించువానికి గౌరవముండునా? గురువునగు నా యాజ్ఞఁగూడ నిరాకరించెదవా! నీ మేలుకొరకై యింతగజెప్పుచుంటిగాని, వినకున్న నెవరుజెప్పెదరు? నీకన్న ధనాధిపులే వేశ్యాలోలురై నిలువనీడలేకయుఁ గుడువకూడులేకయు తుదకు సన్యాసులై జెరలాడుచుండిరి. కామాంధకారము కన్నులఁ గప్పుటచే నేమియుందెలియక వెలకాంతమాయకులోనై పల్కు చుంటివి. ఇప్పటికైనను దెలివితెచ్చుకొనుము. కులగౌరవము నిల్పుకొనుము. ప్రతాపసేనా! యీరహస్యము వినుము.

ఉ. ఎవ్వడు మీ దెరుంగక యు • ధేచ్ఛనుమైకతింజరింపగా
నవ్వల నంశహాని వ్రత • హాని యశోధనహాని పుట్టుఁ తా

నవ్వొడగమ్మనుష్యపశుఁ వయ్యవివేకిచెఱుఁగ జగంబునన్
నవ్వఁగబాలు రౌరవముఁ నంబడబాలును నిందపాలునై".
అను యార్యోక్తి నించుకంత మనమునఁ దలపోయుము.

ప్రతా॥ ఆచార్యా! మీవట్టుదలవిడువరా?

కొండ॥ గురువునగు నాయాజ్ఞమీరి జరించెదవా?

ప్రతా॥ గురువరా! ఇందులకేమిసేయుమనెదరు? నాకాంచనమాలను వీడఁజాల.

కొండ॥ పోనీ, వీడకున్ననుసరియె, వివాహమొనర్చుకొని పిమ్మట వేశ్యనుంచుకొనుము.

ప్రతా॥ అట్లైన అంగీకరించెద.

కొండ॥ మంచిది. కాని సంతోషమైనది.

ప్రతా॥ కాని, వివాహమునకు మాత్రము నేనురాను.

కొండ॥ నీవురాకున్న యింక వివాహమెవ్వరికొనర్పవలయు.?

ప్రతా॥ ఈఖడ్గమునకు.

కొండ॥ ఇట్లొనర్చిన జగము మెచ్చునా?

ప్రతా॥ మెచ్చిననేమి, మెచ్చకున్ననేమి? నాకుఁ దడవగుచున్నది. ఇదె వెళ్ళెద. (అని పోఁబోన కొండభట్టు అడ్డగించి)

కొండ॥ వత్సా! ప్రతాపసేనా! ఏమిజెప్పితివి?

ప్రతా॥ చెప్పునదియేమి సర్వమునకీఖడ్గమే?

కొండ॥ మంచిది. అట్లనేయొనర్చెద.

ప్రతా॥ ఆచార్యా! మీరు పయనముగండు. మంత్రిచే ఖడ్గమును బంపెద. (నిష్క్రమించును.)

కొండ॥ ఔరా! ఏమిరా వేశ్యలమాయ? ఏమియు నెరుంగని యీ ప్రతాపసేనుని ఎంతకామాతురునిగ జేసెను. ఔను స్త్రీలవలన గదా లోకమంతయు మోసపోవుటలు? అందు వారాంగనయన్న వేరుగ జెప్పవలయునా?

గీ. దర్శనముఁజేయు నెమ్మది • తత్తరిల్లు
స్పర్శనమ్మున సంపదల్ • సమసిపోవు
గాన వేశ్యలతో పొందు • మానుడనుచు
వేడుచుంటిని యువకుల • వేయుగతుల.

ఆర్యులారా ! వేశ్యలన్న గుర్తెఱిఁగి సంచరింపుడు. ధనతను మదాంధతచే విర్రవీగకుఁడు. (నిష్క్రమించును. యవనికజారును.)

———:0:———

తృతీయరంగము: కాంచనమాలసౌధము.

[ప్రవేశము: ప్రతాపసేనుడు] (ఆసీనుడై) కాంచనమాల]

కాంచ॥ ప్రాణేశ్వరా! నమ్మించి మోసముఁజేసితివే?

ప్రతా॥ నీకేమియు లోటులేదు. భీతిఁజెందకుము. ప్రేయసీ ! నాకు నీయెడఁగల సంతసమునకు మితిలేకయుండెనుగదా ! లభించిన వారాంగనలపొందే లభించవలెను.

కాంచ॥ ప్రాణేశ్వరా ! నేడు నృత్యగానములచే కొంతకాలము గడుపుదునా?

ప్రతా॥ నీయిష్టమగునట్లొనర్పుము.

కాంచ॥ రత్నమాలా ! ఏమిచేయుచుంటివి ?

(తెరలో) ఏమియులేదు.

కాంచ॥ మీరెల్లరు అలంకృతులై తీవ్రముగరండు.

[ప్రవేశము: కొందరువేశ్యలు] (అలంకృతులై యిరువైపులనుండి)

కాంచ॥ సఖులారా ! నేఁడు మీబావగారానందించునట్లు నృత్యగానాదు లొనర్పవలయు.

వేశ్య॥ (అట్లుఁజేయుచు) (అనుబంధము 4)

ప్రతా॥ (సంతస మున)

చం॥ కలికిమిటారి ! వయ్యారి ! చొకాటపు నాటలపాటలన్ సుధన్
జిలికితొ, తద్రసంబునకు శేముషి సంతసవార్ధి దేలె ని

య్యలఁగల మోదులంజివ్వురులెట్టునహించెనో జూడుమీ సభా
స్థలి జనులెల్ల, ఱాశిలలచందముగాఁ గనుపట్టిరి త్తరీ,

(దగ్గరకుఁజేర్చుకొని ముద్దిడుకొని) ప్రియకాంత! నిక్కముగ నీవమరలోకమున దేవవేశ్యవై జనింపవలసినదానవు. నాపూర్వపుణ్యా వయఃపరిపాకముచే నన్నుద్ధరించ నీలోకమున జన్మించితివి. ఆహా! నేనెంతకృతార్థుడ. ఎంతధన్యుఁడ. ఎంతపుణ్యుఁడ. నాకు జనించు చున్న యానందమ్మునకు నీవుగదా మూలంబవు? ప్రియా? నాయా నందమును భరింపఁజాల. సఖులారా! మీరింకసొందు. మీకువలయు పాతితోషికము లొసంగెదలెండు.

[వేశ్యలు క్రమముగా నృత్యముఁ జేయుచునే నిష్క్రమింతురు.]

కాంచ॥ ప్రాణప్రియా! నృత్యగీతాదులేమైన రుచించినవా?

ప్రతా॥ రుచించినవా యని బల్కనేల? రుచించుటయుగాదు, అందలి రసమును గ్రోలితిని. ద్రాక్షామరందదేక్షుఖండశర్కరలకన్న లెక్కడురుచ్యమై మనమున కానందమొసగెను గాని యింక మనము లోనికి పోవుదము రమ్ము. (నిష్క్రమింతురు.)

[ప్రవేశము: సేవకుఁడు.] (కాంతామతి చిత్రపటముతో)

మహారాజ్. అందర్ కు ఆనా?

(తెరలో) ఎవడురా. అచటనే యుండుము.

[ప్రవేశము: కాంచనమాల.]

ఓరీ! నీకేమియుపనిపాటలులేవా? ఏమివచ్చితివి? శీఘ్రముగఁ దెల్పుము.

సేవ॥ అరె మహారాజ్ కు బులావ్. జా. తుంకు బులాయనీ.

కాంచ॥ ఓరీ! మీరాజెవరో ఎరుంగుదువా? నే నే

సేవ॥ కాంతామతి అమ్మోడు ఆయంకనే బోర్ . జా

కాంచ॥ సేవకా! కాంతామతి యెవ్వరు? ఆచిత్రపట మామెదేనా? ఏదీ చూతము.

సేవ॥ మహారాజ్ జోరు. మాలుంనీక్యా. (తనలో) తుమార్ మూామే మాటి ఫడేలేవ్. ఏడెకొ అమ్మోడ్. (అని చిత్రపటమిచ్చును)

కాంచ॥ ఆహా! ఏమి యీమె యందచందములు? భువన మోహిని యన నీమెకే చెల్లును. యీతఁడు యీమె సుందరవదనార విందముఁదిలకించిన ఇంక నాపై భ్రాంతిపడునా? అక్కటా నాగతి యెయ్యది? సేవకా! నేనుఁ దెల్పేదనులే పొమ్ము.

సేవ॥ ఎక్కడపోవాలమేం. జాకోబోల్ బె. నైసో అందరుక్కామై జాతా.

కాంచ॥ సేవకా! నీవిచ్చటనే యుండుము. (పటముఁజూచి) ఔరా! ఏమి యీమెయాకృతి. ఈపటము నిట్లైగైకొని యాతనికిఁజూపిన నాకు శుభముగల్గదు. ఈ పటమునఁగల కాంతామతి నేత్రమునకు సున్నపుచుక్కనిడి విరూపినిగఁజేసిచూపి. "ఆడక యాడక నంధురాలినిఁ బెండ్లియాడితినా?" యని హేళనఁజేసెదనాక.

(నిష్క్రమించి ప్రతాసేనునితో పునః ప్రవేశము)

ప్రతా॥ ఔరా! గురుఁడెంత క్రూరచిత్తుఁడు?

గీ॥ వలదు వలదన్న కృత్రిమ • వాక్యములను
నాడి, యిటుచేసె గురుడిదే • యంధురాలి
నేమిజేసిన గసిదీరు • నిప్పుడతని
క్రూరచిత్తుఁడు! మూర్ఖుఁడు! గురుఁడువాఁడె.

ప్రియకాంతా! వానినేమిఁ సేయుమనెదవు? వలదన్న బలిమిని పెండిలిజేసినాడు. చేసెనుపో. అంధురాలినాఁ జేయుట ఈయంధురాలిని గురువును ఏమిసేయుమనెదవు?

కాంచ॥ ఏమియు వలదులెండు. శాంతించుడు.

ప్రతా॥ శాంతి. ఇంకెక్కడిదాశాంతి.

కాంచ॥ పోనిండు. కాంతామతి రాచబిడ్డగుటచే యామెను గౌరవము గ కారాగృహమందుంచుము. గురువగు కొండభట్టునకు ముం డనముగావించి ఖరముపై నెక్కించి యుత్సవముఁ జేసి దేశభ్ర ష్టునిగ జేయుడు.

ప్రతా॥ మంచిది. సేవకా ! నీవుసత్వరమజని కాంతామతిని కారాగృ హమం దుంచుము. గురువును దేశభ్రష్టునిగఁ జేయుము పొమ్ము

సేవ॥ మహారాజ్ మాకీ తెల్సిందిలేదు.

కాంచ॥ ఏమి తెలియలేదా ? కాంతామతిని ముందట కొట్లో బెట్టుమని చెప్పినారు. పిమ్మట గురువును. తలగొరిగించి గాడిద పైనెక్కిం చి యూరేగించి వెళ్ళగొట్టుమనిచెప్పినారు. ఇప్పుడు తెలసెనా ?

సేవ॥ ఆ. (తలయూపుచు) మాకీయిప్పుడు తెలుస్తాదియేం. ముందువుం డది ముసళ్ళపండ్గ ఆబ్కిక్యాహై. మహారాజ్ క్యాహుకుం?

పతా॥ ఏమిరా ! కాంచనమాల చెప్పియుండలేదా ? అట్లెమొనర్పుము.

(అనియిరువురు లోనకుఁ బోవుదురు)

సేవ॥ కాంతామతి అమ్మోరుకీ భోత్ కష్టంఆయా. హాయ్, అల్లా. కాంచన్ మాలా సైతాన్ కాసీ అయారే ? మహారాజ్ హుకుం సెయ్యాల వొద్దు మల్లీమో కాంచన్ మాలా మాటల్కీ యిగి పెళ్ళాంగుడ్డిది అంటాసెప్తాడు కాంతామతి అమ్మోరుకుకాల్కీంది మట్కీ వస్త దియేం కంచిని మాధర్ చోద్ ఛోక్లీ,

(నిష్క్రమించును. అవనికజారును)





శ్రీ

# కాంతామతి

## ద్వితీయాంకము.

———(౦)———

(ప్రథమరంగము: కారాగృహము)

[ప్రవేశము: కాంతామతి. కారాగృహములో]

(అనుబంధము 5.)

హా! దైవమా! నేనేమియపరాధ మొనర్చితిని? నన్నిట్లీకారాగృహమందు నిర్బంధించనేల? పరిణయమైనదాది నేటివఱకును నామోమైనజూడలేదే? పోనిమ్ము, నాథా! నేనపరాధినైనపుట్టినింటకిఁ బంపరాదా? లేకున్న నెందైన వేరుగనుంచరాదా? తామొనర్చు కార్యముల కేమైన నడ్డుకొంటినా? వేశ్యాలోలురై, అగ్నిసాక్షిగ వివాహమాడిన నన్నుఁ గన్నులనైనఁజూడక నిష్కారణముగ కఠిన శిక్ష విధించితివే? అయ్యో! నేనెంతపాపురాలను? ఓకాంచనమాలా! నీవెంత పూజ్యురాలవు? నీకైన నాయెడ దయరాదా? అయ్యో! ప్రాణకాంతుడే యిట్టి ఘోరకార్యమునకుఁ బాల్పడ వేశ్యాంగనవగు నీకుమాత్రమేల కనికరముగల్గును? అక్కటా! పూజ్యుండును, పితృ సమానుఁడును, కులగురువునగు కొండభట్టుగారికిఁగూడ నెట్టిచెట్ట సంభవించినది? అయ్యో! నాగ్రహచారమా.

సీ॥ వెలకాంత నటుగూడ • కులకాంత నిటువీడ

యశమనిదోచెనా? • వసుమతీశ!

కుంగౌరవమ్మెల్ల • బలుచనౌనంచని
మదిలోఁదలంపవా ? • మనుజనాథ !
సాటివారలువిన్న • శోకంజాతురటంచుఁ
దలపోయకుంటివా? • ధన్యమూర్తి!
బంధుమిత్రులమాట • పాటించవైతి వ
య్యదిగాక తప్పుగా • నరశితయ్య!
గీ॥ ఏమి యపరాధమొనరించి • తిప్పుడేను !
మదికి సుంతైనదోఁచదో • మాన్యచరిత!
తప్పులున్నను మన్నించ • దగునునన్ను
రక్షణముఁజేయవేఁడెద • రాజమౌళి!.

అయ్యో! కోరనోములునోచి నెక్కుడు ఫలమురమ్మన వచ్చునా ? నావంటి పాపురాలు బ్రతికిఁ పుట్టినింటికి మెట్టినింటికి నపయశముదెచ్చుటకన్న జచ్చుట మేలుగదా ? హా! ప్రాణప్రియా! ప్రతాపసేన రాజేంద్రా ! నన్నేల యిట్లు నిర్బంధించెదవు ? నాకడ నేరమున్న మీఖడ్గముచే ద్రుంపరాదా ? మీకు సౌఖ్యమును, నాకు స్వర్గమును గల్గునుగదా ?

[ప్రవేశము: సేవకుఁడు]

అమ్మోఁడ్ బోత్ రోతే. హైతో క్యాకర్ణా ? మహారాజ్ హుకుం. అవ్మా క్యాకర్తె. కైకునోతే. రోనాకో ఇదిఖాచారం.

కాంతా॥ సేవకా ! నేనేమి యపరాధ మొనరించితిని ? అన్నా ! నీవా కాంచనమాల కడకేగి యిట్లుబల్కుము. "అమ్మా కాంచనమాలా ! నాయెడదయయుంచి ప్రాణేశ్వరునకుఁజెప్పి నానిర్బంధవిమోచనము గావింపుము తల్లీ! నీకునేను సేవకావృత్తి జేసెద. నీమేలు మరువఁజాల. నా యాభరణములన్నియు నొసంగెద"నని దెల్పుము. పిమ్మట ఆమెదయ యెట్లుండునో.

సేవ॥ అమ్మా ! వైసాబోలేతో మహారాజ్ ఫిర్ క్యాదండన సెప్తాదో. మైజాతానీ సలామ్కర్తా.

కాంత॥ అన్నా! నీకీచంద్రహార మొసంగెద మహారాజు వినకుండగ రహస్యముగ నాకాంచనమాలతో "మిగుల దుఃఖించుచు నిట్లు బల్కుమనె"నని నుడువు మాతండ్రీ! నీకుపకార మొనరించెద.

సేవ॥ ఓమాధర్‌చోద కంచిన్ ఫిర్ ఓబాతాసుంతా. సునో‌ఫిర్ మహారాజుకు బోల్తానీ? పిచ్చిఅమ్మా! ఎక్కడమాటల్ సెప్తావును కాంచన్‌మాలాఅంటె నీకీతెల్వదు. కొంపల్ కొంపల్ మింగియేస్తాది.

కాంతా॥ అన్నా! అయినఁబోయిరమ్ము. నాప్రాప్త మెట్లుండునో యిఁకఁగో! చంద్రహారముఁ గైకొనుము. (అనియిచ్చును.)

సేవ॥ (హారముఁదీసికొని) అచ్చా జాతేలేవ్ అమ్మా! (పోవుచు) మంచిహారం మాకీచిక్కింది అండీ. ఇట్టాసిక్కాల మాకి లేక్ పోతె పదిరూపాల్ జీతంమీద పెళ్లామ్కి బిడ్డల్కి ఎట్టా బతికిచ్చాల మల్లీ మేం. (నిష్క్రమించును)

కాంతా॥ అయ్యో! దైవమా తుదకునాగతి యెట్లైనది. నాప్రాణకాంతునిఁ గనులారఁగని యెరుంగకుండగనే యిన్నియగచాట్లు బెట్టితివా? హా! నేనెంత పాపురాలను?

సీ॥ పతి! రూపమునఁ జూచి • యతిసమ్మదంబుతో
నుండెడి భాగ్యంబు • పండదయ్యె
కాంతు! సేవలొనర్చి • ఘనయశంబందెడి
పున్నెమునాకింక • పుట్టదయ్యె
నాథు! నిచెంగట • నాముచ్చటల్ జూపఁ
గోరినకోర్కె చే • కూడదయ్యె
ప్రియుని! ముఖముఁజూచి • ప్రీతినుండగఁ జాలు
నంతయదృష్టంబు • నమరదయ్యె

గీ॥ అక్కటా! యెట్టిపాపినో • యిక్కటులిల
నందుచుంటిని కారాగృ • హంబునందు

మిమ్మనగనేలనయ్యా ! నా • బమ్మదేవ
రీస్లు: నానొమ్మవ్రాసె నం • దెట్లుగడతు.

అక్కటా ! కాలమా ఎట్టిమార్పులంజేసితివి లెక్కలేని సఖీజనంబులగలసి సంతసముగ నుండునేని కారాగృహందే కాకినై. నిద్రాహారంబులులేక దుఃఖించవలసెనే ? హానాథా!

(మూర్ఛిల్లును (యవనికజారును)

---

ద్వితీయరంగము: కాంచనమాల సౌధము.

—:0:—

(ప్రవేశము: కాంచనమాల, ప్రతాపసేనుడు) (శయనించి)

(అనుబంధము 6)

కాంచ॥ ఈప్రతాపసేనుడు కీల్బొమ్మవలె నాచే జిక్కినాడు. ఈరాజ్యమునందును, తనయందును, తనయింటియందును వేయేల? సర్వ వ్యవహారములయందును సర్వాధికారములనుబొంది యీతనినొక సన్యాసిగంజేసి గూర్చుండబెట్టితిని యింక నాకేమిం గొరంత ? ఈతని ధనమంతయుఃగాగ బిలువంజేసితిని. యీధనముచే నాసంతతివారు పదితరములవర కొంతవెచ్చంబెట్టినను దరుగదు. ఆహా ? ధనముగడించుమార్గమన్న వేశ్యలదేకదా ?

చం. విటుల గృహంబుజేర్చుకొని • వేయువిధంబుల వేషభాషలన్
పటులనుజేసి హైంబయిభ్రమల్ గనుపర్చి ధనంబు సర్వముల్
జిటికలోలాగి నిర్ధనికు • నిందగజేసియు జొచ్చె యొక్కటిక్
దిటవుగంజేతికిచ్చినురి • ద్రివ్వటజూడగె ? వేశ్యకాంతలుల్॥

వేశ్యకాంతలంగూడి బాగుపడినవా డీలోకములో నెవ్వడుండె ? మాన్యములమ్మియు, అగ్రహారములమ్మియు, రాజ్యములమ్మియు, గృహములమ్మియు, వెలకాంతలకుం బెట్టి యెందరెందరు సన్యాసులు కాలేదు? (ప్రవేశము: సేవకుడు)

కీర్తన.

"దోసుకునే ధానా-నీకు దోసంలేదేదొంగధానా ।
దైవకటాచ్ఛం తర్లిపోతది-ధంచునామీద ఖానా"

మహరాజ్ యెక్కడవుంది ? [మీాదికి హాస్యముగఁబోవును]

కాంచ॥ ఓరీ ! ఏమిమూడినది. యిట్లుపైబడఁజొచ్చెదవు ?

సేవ॥ నై లేబోలో

కాంచ॥ ఓరీ ! రాజుతో నివ్వాడేమి పనిగల్గినది ?

సేవ॥ సునొ కాంతామతి అమ్మాండ్ భోత్ కష్టంలోవుంది. జైలే మెరోతెహై. నీకిప్యార్థిచ్చి "జైల్కానాకీ యిడిపిచ్చు అమ్మా నీకీ కాల్కిమొక్కుతా" అని యేడుస్తావుంది. మహారాజుకి జల్దిబోలోజి. పాపు.

కాంచ॥ కాంతామతి తన ప్రాణేశ్వరునకుఁ జెప్పి తన కారాగృహవాస ముఁదప్పింపుమని ప్రార్థించి నమస్కరించినదా? కల్ల. నమ్మజాల.

సేవ॥ నై అమ్మా అంతాసత్తెం. నీతోడు మట్టితోడు. బోలు జా, రోతే అమ్మా.

కాంచ॥ సేవకా ! నేనిదివరకే అయనకుఁ జెప్పియుంటిని. నామాట వినఁడయ్యె నేనేమి సేయుదును ? అనేకవిధముల బ్రతిమాలి గూడ జెప్పితిని.

సేవ॥ తుమారే బాతా సుంతానీ ? నంగనాచిమర్యా ! బోలో జా.

కాంచ॥ ఐనమరలఁ జెప్పెద. నీవిచ్చటనే యుండుము.

సేవ॥ అచ్ఛా. జావ్. (ఒకచంపకేగి నిలిచియుండును)

కాంచ॥ (పరితాపసేనునిలేపి) పాణేశ్వరా ! వింటిరా ? దుర్మార్గురాలగు కాంతామతి మిమ్మును నన్నును మిగుల నాడిపోయుచున్నదట. మీాకు భార్యయగుటచే మిమ్మాడిపోసిన పోయుగాక. నన్నేల నాడిపోయవలయు ? నాకునుదానికిని యేమిసంబంధ మున్నదని ? నీభార్యచేఁ దిట్టించుటకా నన్నుఁ జేరదీసితివి ? హా ! పాణేశ్వరా ! నేనింక జీవించజాల. నేఁడైన దుమికి

ప్రాణములఁబాయుదాన. నాకింక సెలవొసంగుడు. (అని యేడ్చుచు) నాధా ! ఇంక నన్నువీడి నీభార్యనే గూడియుండుము. నాకును నీకును నేటితో రుణము దీరినది.

ప్రతా॥ ప్రియకాంతా ! దుఃఖింపకుము. (కంటినీరు దుడుచుచు) ఐన దానినిప్పుడేమి సేయమందువు ?

కాంచ॥ (కోపముతో) ఏమిచేసెదరో నేనెఱుంగను. కనికరించి కామించినను సరే. లేక కానమున్న కాలబెట్టినను సరే. ఇంకనన్నడుగకుఁడు. (పెడ ముఖముఁబెట్టును)

ప్రతా॥ ప్రేయసీ ! ఇదంతయు నీకెవ్వరు చెల్పిరి ?

కాంచ॥ ఎవ్వరో యననేల ? సేవకుఁడే ? ఇందేయున్నవాఁడు వలయునేని సర్వము బల్కించెద. పిలతునా ? వాని.

ప్రతా॥ నిజముఁ దెలిసికొందము రమ్ము.

కాంచ॥ వినుఁడు మీరేమియుమాట్లాడవలదు. సర్వమువానిచే నేనే జెప్పించెద. మీరు మారుబల్కిన కార్యముచెడును. మీయెడలగలభీతిచే నాతఁడు తారుమారుకాఁగలడు. మీరూరకొనవలయు. ఇందుల కంగీకరించెదరా ?

ప్రతా॥ అంగీకరించకేమి. నీమాటకు మీరుదునా ?

కాంచ॥ అట్లైనరండు. (ఇరువురు ముందుకువచ్చి)

కాంచ॥ సేవకా ! ఇటురమ్ము. కాంతామతి కారాగృహమందుండి యేడ్చుచుండుటలేదా ?

సేవ॥ నిజం. నిజం.

కాంచ॥ నీవు నాతోడఁ జెప్పినమాటలెల్ల అబిడ పల్కినదా లేదా ? సత్యముఁజెప్పుము.

సేవ॥ మాకీ అబద్ధం సెప్పాలఅని ప్యాణంమింద వచ్చింది యేం.

కాంచ॥ ప్రాణేశ్వరా ! ప్రత్యక్షముగ వింటిరిగదా ? పైనిమీయిష్టము.

ప్రతా॥ సేవకా ! అంతయు నిజమా ?

కాంచ॥ (ప్రతాపసేనుని చాటునకుఁబోయి చెప్పుమని సేవకునకుసైగ చేయును)

సేవ॥ ఓబాతా సాబ్ఁ సచ్చి మహా రాజ్ మాగడ్డముంకోడు

ప్రతా॥ అట్లయిన యాదుర్మార్గురాలిని యరణ్యములపాల్ జేసిరమ్ము పొమ్ము ప్రాణేశ్వరీరమ్ము (అని లోనికిఁబోవును)

కాంచ॥ (పోవుచు) ఇప్పటికి నాకోర్కె దీరినది యింతవరకును తన భార్యమోముఁజూడకయే నేఁజెప్పినట్లు జరించుచున్నాడు. నిజముగ నీతఁడుభార్యనుఁజూచియున్నచో నన్నుగౌరవించునా? అందులకే నేనిట్టి పన్నుగడఁ బన్నినది నేనాతని హృదయక్షేత్ర మందు మాయాబీజము నాటుచునేయుంటిని. నేనాటిన బీజ మెల్ల యాంకురించి వృద్ధినొందుచునే యున్నది. ఇదియు చక్కగ వృద్ధినొందినది. వేశ్యలమర్మములుఁ గెలియ నెవ్వరి తరంబు ? అరచేత వైకుంఠముఁ జూపుచెదుంగరో ?

(నిష్క్రమించును యవనికజారును.)

సేవ॥ హాయ్. హాయ్. యంతమాయాల్ సేసి మసిపూసి పోయింది. రాజు అచ్చాఅద్మిహైతో నైసాఖేత్తే? మాదస్ సోద్ కంచిని కైసాబోలేంకో వైసానుంతె. వుస్ క్యాక రేబిరాజ. అబి క్యాహై ? ముందువుంది ముసళ్ళపండ్గ. (నిష్క్రమించును)

తృతీయరంగము డవి.

[ప్రవేశము: కాంతామతి, సేవకుఁడు]

(అనుబంధము 7)

అయ్యో ! తుట్టతుదకు నాగతియిట్లాలయ్యె ? నాకిట్టి చెట్టపాటు సంభవించునని కలనైనఁ దలంపనే ? మహారాట్కుల సంజాతనై రాజాధిరాజ సార్వభౌముడఁగు ప్రతాపసేనరాజేంద్రునకు రాణినై రాణివాసముండుటకుమారు వనవాసమాయెనే ? హా ! హతవిధీ! హా ! ప్రాణకాంతా ! ప్రతాపసేన రాజేంద్రా !

వేశ్యమాయకుఁజిక్కి ♦ విటకాంక్షతోఁగూడు
బుద్ధిమీ కెవ్విధి ♦ బుట్టెనయ్య!
పుట్టెఁబోగురుమాట ♦ నట్టెవినియుమీర
లరయకేటికి బెండ్లి ♦ యాడితయ్య!
పెండ్లియాడినదాది ♦ ప్రేమనఁజూడక
నెడబాసియుంట మీ ♦ కేలనయ్య
యెడబాసిననుసరే? ♦ పడరానిపాట్లకై
వనభూములకుఁబంపఁ ♦ బాడియయ్య!

గీ. పాడియైనను హర్షమో ♦ భాగధేయ
నిందమీకిది తగదని ♦ గుందుచుంటి
వేశ్యమాటల విననేల? ♦ వెతలివేల?
మీకరాసిన్ని తలఁదీయ ♦ మేలునాకు॥

హా! దైవమా! నాకీ కపతి సుందర వదనారవిందముఁ జూచు భాగ్యమబ్బునా? అదియేకల్ల.

సేవ॥ అమ్మా! సోనాకా. కైకుసోతే. కాంచన్ మాలాసై తాన్ వై సాకరె. తుమారానక్షీబ్ మె అల్లా వైసాలిఖే. క్యాకర్తె?

[ప్రవేశము: ఉత్తమశీలుఁడు] (ఒకవైపున)

ఈమె యవ్వరై యుండును? ఈమె రూపలావణ్యముఁ జూడ మహారాట్కుల సంజాతవలె గన్పడుచున్నది. ఐన వెంటనుండిన వీని నడిగి దెలసికొనియెద. (సేవకునిచే సైగచేబిలచి) చెవులోనేమొ జెప్పును.)

సేవ॥ ఓ మాటల్ మాకీ పనికిరావు. లచ్ఛల్ లచ్ఛల్ గావాలా.

ఉత్త॥ సేవకా! నీకు ద్రవ్యాపేక్షగలదేని యట్లనే యొసంగెద. ఎంతధన మిమ్మనెదవు?

సేవ॥ [చేతివేళ్ళుఁజూపుచు] లచ్ఛల్ లచ్ఛల్ బోలేఁసీ!

ఉత్త॥ అట్లుగాదు ఒక్కలక్ష నిచ్చెద

సేవ॥ హైతో జల్దీదేవ్ జాతుంమై

ఉత్త॥ ఐన రమ్మ ద్రవ్యమిచ్చెద

సేవ॥ జాంగిచెలో (నిష్క్రమింతురు)

కాంతా॥ హా ! దైవమా ! వీరలేదియో రహస్యాలోచనఁజేసినారు వీరి యాలోచనచే నాకేమియు ముప్పుగల్గదుగదా ?

[పునఃప్రవేశము; ఉత్తమశీలుడు, సేవకుడు]

సేవ॥ అమ్మా ! ఈనమహా రాజ్ యీన యింటికియెల్లిపో

కాంతా॥ అయ్యో ! సేవకా! నట్టేట పుట్టిముంచినట్లు నన్నీ యువకుని కొసంగితివా? ఇంక నాగతియేమి?

సేవ॥ ఫర్వానై ఫర్వానై రోనెకో [ఉత్తమశీలునితో] మహారాజ్ పితారాసిర్మె రఘోజాతా [పెట్టెనెత్తుకొని] తల్లిబిడ్డమల్లె సూడాలమల్లీ జాతుం [పోవుచు తనలో] మహారాజ్ భోత్ పైసా దియ్యా. బడాసంతోషంఆయా [నిష్క్రమించును]

ఉత్త॥ కాంతా! రమ్ము నాగృహంబునకుఁబోవుదము

కాంతా॥ అన్నా నీగృహంబున కేలరావలెను?

ఉత్త॥ లక్షరూప్యంబులిచ్చి నిన్ను విక్రయించుకొంటినిగదా ?

కాంతా॥ [తనలో]కట్టా! ఎంతఘోరము జరిగినది. ఓరీ దుర్మార్గా! సేవకా! ఎంతకార్య మొనర్చితివిరా? [పై] అన్నా! ఇట్టికోర్కెనుగోరక నీమార్గమున నీవుఁబొమ్ము.

ఉత్త॥ ఏమి? ద్రవ్యమెచ్చించి నిన్నుంగొని నాదారిన నేను బోవలెనా! ఎక్కడికిబోయెదవు? [అని పట్టుకొనబోవును]

(అనుబంధము 8.)

కాంతా॥ [తప్పించుకొని]

గీ. పరునికాంతనుఁగోరుటా • పాపమనుచు
నెరుగవా ? మూర్ఖ! యిదినీకు పసుపుగాదు
నీదుభార్యను'సైదోండ్ల' • నెగడిపతులు
బట్టనెంచిః ! హితమౌనె ? పాపి! చెనటి !.

ఉత్త॥ లోకమోహినీ !

సీ॥ మానినీమణి!మోవి • మధురసం బానిన

దాడ్రిమ్నారసము వేరె • దాగ్రివవలెన ?
చంచలాక్షి! రో నీదు • చన్నవఁబట్టిన
హేమగిరుల్ వేరె • వెదుకవలెన ?
ముద్దులగుమ్మ ! నీ • ముఖమండలముఁజూడ
పండువెన్నెలలోన • నుండవలెనె?
కలికి ! రో నీమేని • కాంతులఁగనుగొన్న
కాంచన లతలను • గాంచవలెనె ?
గీ॥ అండజాక్షిరో ! నీయూరు • కాండములను
జూడ నారంభతరువులఁ • జూడవలెనె ?
కుందరదన! మీాదట నిన్ను • గూడియుండు
సౌఖ్యమునమించునదె స్వర్గ • సౌఖ్యమైన.
తరుణీ ! ఇంకజాగొనరించక నామనోరథముఁదీర్చుము(పట్టుకొనబోవును.)
కాంతా॥ (తనలో) అయ్యో ! దైవమా ! ఇంకనేనేమి సేయుదును ?
వీడుకామాతురుండై నన్నుఁబట్ట సాహసించెనే ? (ప్ర, అన్నా
నామనవి వినుము. పరనారులఁగోరుట పాతకంబుకాదా ? మరి
యురక్త మాంస భూయిష్టంబగు నీతనువును వేవిధంబుల గార
వ వస్తుసమితితో సరిఁబోల్చి వర్ణించెదవు బుద్ధిమంతుడవగు
నీకిది జెల్లునా ? నేనొక్కటిఁజెప్పెద వినుము.
సీ॥ బంగరు కలశముల్ • పాలిఁడ్లటనియందు
మర్మాంసయుతమైన • తుండ్లుగావె ?
సరసి జాతములలో • చనములటందురు
పుసిగారు ముఖమునో • పుండ్లుగావె
బింబఫలంబులే • పెదవియంచనియందు
దిగువనెత్రనితోలు • తిత్తిగాదె ?
హార్యక్షమునె కౌనటంచని యందురు
నడయాడు సన్నని • నరముగాదె ?
గీ. శుకపిక ధ్వనులందు వ • చోరచనల

నట్టిలోనుండి గూసెడి • గుఱ్ఱుగాదె?
మేల్మిబంగరు నిగ్గని • మెచ్చుకొందు
రయ్యయో! యిదిమాయ • కాగుమ్మగాదె!

అన్నా! నీకును నాయట్టితో బుట్టువులుండియేయుండిరి. వారివలె నన్నుంజూడుము. నీకు నమస్కరించెద. నాయెడ సోదరీవాత్స ల్యమునుంచి నన్ను విడిపొమ్ము. చెరుగొడ్డివేడెద.

(అని పెడముఖముం బెట్టును.)

ఉత్త॥ తల్లీ! సుగుణవల్లీ! నీవుచెప్పిన నీతిచే నాకు బుద్ధివచ్చినది. నేటినుండియు యిట్టి దుర్బుద్ధిమాని పరసతులం దల్లులుగనెంచి మెలంగెద. ఇంకనాపై నేరముంచక క్షమింపుము.

(అని కాళ్లపైఁబడును)

కాంతా॥ అన్నా! లెమ్ము నీకు శుభమగుగాక.

ఉత్త॥ తల్లీ! ఒక్కమనవి. నీపై భ్రాంతిచే ద్రవ్యమంతయుఁ గోల్పోతి నిందులకేమిశెలవు?

కాంతా॥ అయ్యా! నీధనమంతయు పోయెనని చింతింపకుము. నీ ధన మునకుఁ బదిరెట్లెక్కుడగు నొక యంగుళీకము నాకడఁగలదు దానిని నీకొసంగెద గైకొని నీ ఋణవిముక్తిఁ జేసికొనుము. ఇదిగో! (అని పెడముఖముతో నిచ్చును.)

ఉత్త॥ (తీసికొని) అమ్మా! ఇదినాకడఁ జెల్లునా! దీని నింత వెల కెవ రంగీకరించి స్వీకరింతురు!

కాంతా॥ అయ్యా! సందియమేల? దీనిరాజాధిరాజులు గ్రహింతురు

ఉత్త॥ అట్లయిన నీ యుంగరము రొక్కరూపకమగువరకు నీవట్టణము నంగల సత్రమందుండుము. నేదీని విక్రయించుకొని వచ్చెద. నీకేమియుభయములేదు. పోవుదమురమ్ము. (నిష్క్రమించును)

కాంతా॥ (పోవుచు) దైవమా!. ఇంకనాకెట్టియాపదఁగల్గఁ జేయనెంచి తివి! సర్వేశా! సర్వమునకు భారకర్తవు నీవని నమ్మియుంటిని. తుదకెట్లు జేసిననునసరే. (నిష్క్రమించును. యవనికజారును.)



శ్రీ

# కాంతామతి

## తృతీయాంకము.



ప్రథమరంగము-మహాపాతకపురములో దుర్బుద్ధియస్థానము.

——(౦)——

[ప్రవేశము: దుర్బుద్ధి, అనృతవాది, మహాపాపి.] (మాత్రులు)

దుర్బు॥ సచివరా! అనృతవాదీ! ప్రజలేమను చుండిరి?

అనృ॥ నోరెత్తుటకు వీలున్నదా! మీయాజ్ఞచొప్పున ప్రజల నందర సాధించి, వేధించి, బాధించుచుంటి. మీశాసనంబతిక్రమించ నేనెంతవాఁడను? ఇది రాజశాసనముగదా?

దుర్బు॥ అనృతవాదీ! నీయట్టి సచివపుంగవుండు గల్గనాకేమికొఱంత? ఉండిన నీయట్టి మంత్రియే యుండవలెను.

అనృ॥ చిత్తము. అంతయు తమ యాజ్ఞయేగదా?

దుర్బు॥ మహాపాపీ! నీకార్యములెల్ల వెనుదీయక ప్రధానముగనెంచి యాచరించుచుంటివా?

మహా॥ ఇట్టివిషయము నాకు మీరుఁ దెల్పవలెనా? నానామధేయమే నేనొనరించు కార్యములఁ దెల్పునుగదా?

దుర్బు॥ నిండా సంతోషమైనది. మరచితిని. కులకాంతలంబట్టి వెలకాంతలవలె నిర్బంధించుచుంటివా?

మహా॥ నిర్బంధించుటయుగాదు. నన్నుంగాంచిన నారీమణులు బగ్గులెత్తి యేమూలనో దాగుచుందురు. అట్టివారింబట్టి వెలికీడ్చి నా

యిచ్చవచ్చినట్లొనర్చుచుంటిని. అందుచేప్రజలెల్లరు నన్నుం జూచి పై కేమియు ననఁజాలక లోలోననేమేమో యాడిపోసు కొనుచుందురు. కాని నేనవిన ప్రతివారికి గుండెదిగులుప్రాణ తల్లటగనేయున్నది.

దుర్బు॥ సచివచంద్రమా! నీవుగదా యీదుర్బుద్ధి మహారాజునకు మి తిలేని యానంద మొసఁగజేయుచుంటివి. మంత్రియన నిట్లుండ వలయు.

మహా॥ ఇదియంతయు తమ కరుణయేగదా.

దుర్బు॥ మంచిది.

(ప్రవేశము: సేవకుడు.)

మహారాజా! యెవ్వడో యొక వర్తకుడట తమ్ము దర్శింప వచ్చియున్నవాడు సెలవా?

దుర్బు॥ మంచిది. ప్రవేశపెట్టుము.

(సేవకుడు నిష్క్రమించి, పునఃప్రవేశము ఉత్తమశీలునితో)

ఉత్త॥ మహారాజా! వందనము. (నమస్కరించును)

దుర్బు॥ ఓయీ! నీవెవ్వడవు? ఏమి కార్యార్థమై వచ్చితివి?

ఉత్త॥ నాకడనొక యంగుళీకముగలదు, దాని రొక్కముగ మా ర్చుకొనవచ్చితిని మీకు వలయునేని దీని గ్రహించి ద్రవ్య మొసంగుడు. (అని యిచ్చును)

దుర్బు॥ (తీసుకొని చూచి) బేరీ! ఇది నీకెచ్చట లభించినది? స్త్రీలు ధరించుదానివలె గన్పడుచున్నదే? దీనినెందైనతస్కరించితివా?

ఉత్త॥ అయ్యో! ఇదేమిన్యాయము. యిదినాసొత్తుగదా? మీరిట్లు బల్కుట న్యాయమా?

దుర్బు॥ న్యాయమో అన్యాయమో? నిక్కముఁ దెల్పుము. లేకున్న శిక్షింపఁబడుదువు.

ఉత్త॥ (తనలో) ఈపరిపాలనము దుష్టబుద్ధియన్న పేరునకుఁదగియే యున్నది (ప్ర) తెల్పెదవినుడు,

దుర్బు॥ తెల్పుము. నా[మోాలబుద్ధిగల్గి]ప్రవర్తించుము.
ఉత్త॥ మీారుబల్కినది నిజమేయగు. నీయంగుళీయక మొక రాచ
కన్నియది. ఆబిడ దీని విక్రయించుకొనిరమ్మన వచ్చితిని.
దుర్బు॥ ఆస్త్రీ యిప్పుడెందున్నది ?
ఉత్త॥ ఈపురమునంగల సత్రమందుండినది.
దుర్బు॥ అట్లయిన నాబిడను నాకడకుఁ దోడ్కొనిరమ్ము.
ఉత్త॥ చిత్తము. (నిష్క్రమించును)
దుర్బు॥ మంత్రులారా! యారాచకన్నె నెట్లైన గూడవలయును గానమీా
రు సమయోచిత మెఱింగి సంచరింపుఁడు.
(పునఃప్రవేశము. ఉత్తమశీలుఁడు, కాంతామతితో)
దుర్బు॥ కాంతా ! ఈయంగుళీయకమెవరిది ?
కాంతా॥ (తలవంచి) నాదియే.
దుర్బు॥ మంచిది. మంత్రులారా! యీామెరాచకన్నెగాఁగన్పడుచున్నది.
యీామె యస్థానమందుండతగదు. గావున యంతిపురంబున
కుఁగైకొనిపొండు.
మంత్రులు॥ చిత్తము. (కాంతామతితో నిష్క్రమించును.)
దుర్బు॥ చేరీ ! ఇంక నీదారిని నీవు పొమ్ము.
ఉత్త॥ అయ్యో ! ఇదెక్కడి న్యాయము ధనమీాయకయు నుంగరమీా
యకయుఁ బొమ్మనుట?
దుర్బు॥ ఇంకనాకడ నధికముగ ప్రేలకపొమ్ము.
ఉత్త॥ అట్లయిన నాయుంగరమొసఁగుడు పోయెద.
దుర్బు॥ పోయెదవాలేదా? లేకున్న కారాగృహమందుంచెద ఎవడురా!
(ప్రవేశము; సేవకుఁడు)
దేవా శలవు?
దుర్బు॥ నీవీదుష్టుని మనపురమునందుండకుండునట్లావలకుఁ జారద్రోలుము
ఉత్త॥ (తనలో) ఔరా! ఎంత న్యాయపరిపాలనము యీాపట్టణమంతె
యు నిట్లనేయుండెగాబోలు.

సేవ॥ ఏదియో గొణుగుచుంటివి ఏమది? ఇందుండి తరలిపొమ్ము.
ఉత్త॥ పోయెదగాని సేవకా! నీపేరేమి?
సేవ॥ నాపేరా? మహానీచుఁడు.
ఉత్త॥ (తనలో) మంచి నామధేయమే మీ రాజునకు, రాజ్యమునకు పరిపాలనకుఁ దగియేయున్నది.
సేవ॥ అధికముగా వాగక పోయెదవా లేదా? (అని నెట్టును)
ఉత్త॥ (తనలో) ఇంతటి మహాన్యాయ పరిపాలన మెందునుగానము. "వినాశకాలే విపరీతబుద్ధీ" యనునట్లు రాజులకు వినాశకాలమాసన్నమైన విపరీత బుద్ధులు గల్గును. (నిష్క్రమించును.)
దుర్బు॥ సేవకా! నీపనిమీదబొమ్ము. (సేవకుఁడు నిష్క్రమించును) నేనింక జాగుసేయక నాయంతిపురంబునకుఁబంపిన యాకాంతతో గూడి రతి రాజసుఖము లనుభవించెదగాక.

(నిష్క్రమించును యవనికజారును)

———:0:———

ద్వితీయరంగము: అంతఃపురము.

[ప్రవేశము: దుర్బుద్ధి, కాంతామతి.]

దుర్బు॥ తన్వీ! పలుకవేమి? నాపైయలుకా?
కాంతా॥ నిరుత్తరయగును.
దుర్బు॥ కాంతా!ఎంతబిలచిననుబలుకవు? బ్రత్యుత్తరమీయవు? ఔను! మంచిమాటలకు మామిడికాయలు రాలునా? నిన్నింక బలిమిని బట్టుటయే యుచితము.
కాంతా॥ (తలవంచుకొని) అన్నా! నేనెన్నో విధములఁ బ్రతిమాలు చుంటినే? కనికరము లేదా? నీతోబుట్టువునని తెల్పితినే? ఇంక నీమాధ్యము వీడవే? కట్టా! యేమిగతి?
దుర్బు॥ రామామణీ! నన్నేల బ్రతిమాలెదవు? నీవుబ్రతిమాలినంతనే మిన్నకుందు ననుకొంటివా? అదికల్ల. ఈదుర్బుద్ధి మహారాజు గుణగణంబు లెరుంగక మాటలాడెద వేమి?

కాంతా॥ అన్యాయుని యెన్నోవిధములఁ బ్రతిమాలినను నీబుద్ధిమరల కున్నదే? నీవు క్షత్రియుండవుకావా? క్షత్రియ ధర్మము తెలియంగవా? నీకుఁ దోఁబుట్టువులు లేరా? నీభార్య నెవ్వడేని నిర్బంధించ నీకు సమ్మతమగునా? నీచా! ఇంక నీ దుర్బుద్ధిమాని సన్మార్గము ననుసరింపుము.

దుర్బు॥ కలికీ! నీవెన్ని విరసోక్తులాడినను సమ్మతమేకాని నీవునామరు సంతాపముఁ దీర్చి నన్నానందింప జేయువరకు నిన్ను విడువను.

కాంతా॥ ఓరీ! నీరాజ్యమందందరు నిట్టివారలేయుండిరా? నీతి నుపదేసించువారలు లేరా? ఒకవేళయుండినను వారి యుపదేశము నీకు విషమయ్యెనా?

దుర్బు॥ మత్తకోకిల.

మారుబారికి నోర్వలేనిక • మాటలేటికి? మానినీ!
ధీరుఁడీ దుర్బుద్ధియంచును • భీమతిఁ ననుగూడుమీ

కాంతా॥ ధీరబుద్ధిగలారలన్యుల • స్త్రీలగోరుదు రేబళా!
ఘోరపాపంబనుచుమదిలో • గొంకవేలర? మూర్ఖుఁడా

దుర్బు॥ పాపమెట్టిదొ తెల్పవే మృదు • పాటలాధరి! వేగమే!
కోపమేలను జాగుసేయక • కోర్కెదీర్చవె కామినీ

కాంతా॥ పాపమెట్టిదొ దెల్పవలెనా? • పాపుడా మతి నీవెనా
ప్రాపుజేరకు దవ్వనుంటుము • బాడిగాదిది నీచుడా

దుర్బు॥ కాంతామణీ! పాపమనునదిగలదా? పరాంగానలఁగూడిన పరువుబోవునా?

సీ॥ పరనారులనుగూడు • పాకాసుర విరోధి
సురగణంబుల యందు • పరువుచెడెనె?

కాంతా పరనారి యాహల్య • భామఁగోరియతండు
పడరాని యిక్కట్లు • బడఁగలేదె?

దుర్బు॥ తారతోఁగూడిన • తారాపతికి యేమి
లోపంబు గల్గెనే • లోలనేత్రి !

కాంతా॥ తారతోఁగూడిన • తారేశుఁగనలేదె
కళలు క్రమంబుగాఁ • దరిగియుంట

దుర్బు॥ రాధతో స్నేహంబు • రహిఁ సల్పు శ్రీకృష్ణు
నాదిదేవుండని • యనఁగలేదె?

కాంతా॥ రాధతో స్నేహంబు • రమణ నల్పినకృష్ణుఁ
డోలగంబున బేలు • పాలుగాఁడె?

దుర్బు॥ గీ. పలనీకథలెల్లను • చాలుచాలు
నాదు కోరికదీర్చవే • నళినసయన!

కాంతా॥ చాలుచాలింకబుద్ధినీ • కేల లేదు ?
అరయ నన్గోర నిడుముల • నందగలవు.

దుర్బు॥ మిటారీ ! నేనింక నిలువజాల (అనిచెయ్యిపట్టుకొనబోవును.)

[ అనుబంధము 9 ]

కాంతా॥ (తనలో) ఏని బారినుండియొకొనకపటోపాయంబుచేదప్పించు
కొనవలెను. (ప్ర) రాజా ! తొందరొందకుము.

దుర్బు॥ కామినీ ! ఏమది తెలియఁబల్కుము.

కాంతా॥ తెల్పుటకుఁ గొంచెము సందియముగల్గి నోరాడుటలేదు.

దుర్బు॥ సందియమక్కరలేదు సర్వముం దెల్పుము.

కాంతా॥ నేనెంతకాలము నుండియో నిట్లుగా ద్రిమ్మరుచుంటిని.

దుర్బు॥ ఎందులకు ?

కాంతా॥ నామదికి నచ్చిన పురుషుఁడెందు దొరకునాయని.

దుర్బు॥ నీమదికి నేనచ్చియుండలేదా ?

కాంతా॥ ఆ. నచ్చకేమి.

దుర్బు॥ నచ్చిరేమే యుంటినిగదా ? ఏలనింతరాద్ధాంతము జరిపితివి

కాంతా॥ నాయెడ మీకు ననురాగము కలదో లేదోయనియిట్లుజరిపితి

దుర్బ॥ ఎంతమాట? లేకేమి. నీవెట్లొనరింపుమన్న యట్లొనరింపనా?
కాంతా॥ అట్లయిననిన్నే వరించదలచితిని.
దుర్బ॥ ముమ్మాటికి నిజమే? వరించుట.
కాంతా॥ ఊఁ. అందుకేమరి వచ్చినది.
దుర్బ॥ అటులైన జాలమేల? రమ్ము యంతిపురంబునకు.
కాంతా॥ (తనలో) ఎట్లయిన వీనిని నమ్మించి యావలకుఁ దాటవలెను.
[ప్ర] పిచ్చిరాజా! అప్పుడే యంతిపురంబునకు? ఇల్లలకి గ్రుమ్ముగ్గుపెట్టిన మాత్రమున పండుగవచ్చునా?
దుర్బ॥ ఇంకేమి యాటంకముగలదో నుడువరాదా?
కాంతా॥ నీక్షేమముఁగోరి దెల్పుచుంటిని, నీవంగీకరించిననీకుదక్కుదును
దుర్బ॥ నాక్షేమముఁగోరియే దెల్పుచుంటివా?
కాంతా॥ ఊఁ. అదేమరి.
దుర్బ॥ ఐన జాగేల? తీవ్రముగఁదెల్పుము.
కాంతా॥ వినుము. నాకొక వ్రతముకలదు.
దుర్బ॥ అది నాకడనే దీర్చుకొనరాదా?
కాంతా॥ అదిదీర్చిన నీకోర్కెయే దీరగలదు.
దుర్బ॥ ఏమది తెల్పుము.
కాంతా॥ అది గౌరీవ్రతము.
దుర్బ॥ ఈవ్రతమున కేమి గావలయును.
కాంతా॥ ఇందులకా? లెక్కలేని ధనవ్యయముకాగలదు.
దుర్బ॥ అందులకు నాకుసమ్మతమేయగు. ఇంతియేగదా? మరేమియు లేదుగదా?
కాంతా॥ లేకేమి? మరొకటి పెద్దనియమమేగలదు.
దుర్బ॥ అంత పెద్దనియమమేమి? అదియుఁదెల్పుము.
కాంతా॥ వినుము. నాకొకసౌధము నిర్మింపవలయును. అందు నారుమాసముల నారుదినంబులు గౌరిని సేపూజింపవలయును అందుల

కనేకదానము లొనర్చవలయు. అందులకుఁదగినధనమువలయు నపుడెల్లఁ బంపుచుండవలెను.

దుర్వ్య॥ అబ్బా ! ఆరుమాసముల యారురోజులే ? అంతవరకు నేనునిలువఁగలనా? పోనిమ్ము యారుమాసములు వీడి యారురోజులే చేయరాదా?

కాంతా॥ అట్లొనర్చుటకు వలనుపడదు తొలుత, నీయట్టి పురుషశ్రేష్ఠునను, రాజకులాభరణమును దొరకునాయని యట్లొనర్చితిని కాని నీవింత శీఘ్రముగ నాకుఁజిక్కుదువని దలంచనైతి. అయ్యో ! ఏమీ నాబుద్ధిమాంద్యము. అప్పుడు నాకింత జ్ఞానముండిన యిట్లొనర్చనుగదా?

దుర్వ్య॥ ఎట్లో ప్రాణమునిల్పుకొందునులే.

కాంతా॥ మరొకటి మరచితిని.

దుర్వ్య॥ ఏమది?

కాంతా॥ నావ్రతము సమాప్తమగువరకును నీవుగాని నీసేవకులుగాని నావ్రతాలయముకడకు రావలనుపడదు.

దుర్వ్య॥ అయ్యో! ఏమిది నిన్నుజూచియైన ప్రాణములు నిల్పుకొందమనుకొంటినే?

కాంతా॥ నీరూపము నాకన్నుల కగపడరాదు. నీశబ్దము నాచెవులకు వినబడరాదు. అట్లుగాక తప్పిజరించితివేని శిరము వేయివ్రయ్యలై చత్తువు. (కొంచెమాగి) అయ్యో! రాజా! నీవుచచ్చిన నాకింక దిక్కెవ్వరు ! ముందు నాగతి యెట్లున్నదోగదా నీక్షేమమును నాసౌఖ్యమునుఁ గూర్చి చెప్పితిని.

దుర్వ్య॥ ఓహో! నాక్షేమమునుఁగూర్చియే సర్వము దాపకజెప్పితివా ?

కాంతా॥ ఊఁ. అందు కేమరి.

దుర్వ్య॥ అటులైన రమ్ము పోవుదము (వెంటనంటును)

కాంతా॥ దూరమున నుండుము, దూరముననుండుము. ముందు నీవు సాగుము.

దుర్బు॥ రమ్ము. (ముందుపోవును)
కాంతా॥ (వెంటపోవును) [యవనికజారును]

---

తృతీయరంగము- కాంచనమాల సౌధము,

—:0:—

(ప్రవేశము: కాంచనమాల)

ఆహా! మోహమెంతపాడుది. తన శరీరము తన నెఱుంగకుండ జేయునుగదా? నా యందచందములఁజూచి రాజాధిరాజగు ప్రతాపసేనుఁడునన్నుంగూడి ధనమెల్లగొల్లవెట్టినాడు. ఒక్కధనమేమి? రాజ్యమంతయుఁ గోల్పోయి తుదకు నిలువ నీడలేక, కుడువఁగూడులేక హాహాకారవమెత్తి జరించుచుండె. ఔరా! వారకాంత పొందెంత ధనాధిపునైనను, ధనహీనునిఁగఁజేసి పడరాని శ్రమలఁబాలొనరించునుగదా? ప్రతాపసేనా! నీవునాచెంతకుఁ జేరునపు డెంత గౌరవముగనుంటివి? పిమ్మట నాకు దాసుడవై పెద్దలవాక్యముల వినక రాజ్యమును, భార్యనుఁగోల్పోతివే? ఇందులకు నేనేగదా కారణము? ఛీ! నేనెంతపాపురాలను? ఓ ప్రతాపసేనా.

సీ. నారూపమునుఁజూచి • నన్నువీడకఁగదా?
గురునాజ్ఞమీరిట్లు • గులికినావు
నాయౌవనముజూచి • నమ్మివచ్చియుగదా?
భార్యను వనముకు • బంపినావు
తుచ్ఛసుఖంబంచు• నిచ్చయించకఁగదా!
కులగౌరవము మంట • గలిపినావు
నృత్యగీతములను • నిత్యంబువినిగదా?
మేనుమరచినీవు • మెలగినావు
గీ రాజ్యపాలనమంతయు • రగులఁబెట్టి
ప్రజలసౌఖ్యంబులెల్లను • పాడుచేసి

నాడు చెంతకుజేరితో • నమ్మి; తకట!
వేశ్యతోఁ బొందు విటులకు • వెతలుగావె?

నే వగవనేల? బుద్ధిహీనులై విటకాండ్రు మాగున్నములదరిఁ జేరి మమ్ముఁ బ్రార్థింప మేమేమి సేయఁగలము? అంతయు విటులదే లోపము. మేము వారలఁ బ్రార్థించితిమా? మాగృహంబు లలంకరించుమంటిమా? తల్లిదండ్రులమాటల సరకుఁ జేయక సోమరులై, చదువుసంధ్యల మాని త్రాగుబోతులై, మా వేశ్యల వాడఁ జేరి సర్వముఁ గోల్పోవు చుండిరి ఇందులకు మేమేమి సేయఁగలము? మాదేమిలోపము?

(నిష్క్రమించును.)

(ప్రవేశము: ప్రతాపసేనుఁడు) [ఒకవైపునుండి)

ఔరా! కాంచనమాలా! ఎంత జేసితివే?

ఉ. కూడును నీళ్ళు లేకఁగను • కూరికి నేటికి మూడునాళులే
జాడనుబోదు వేశ్యనిట • సాదముకొంచెము బెట్టుమంచు నే
వేడెద నిష్ఠురాసక్తియ • వేయుదెబోనము పొట్టనిండ, మో
మోడక బోదు పూర్వవిధ • మాచితితో మరి సానియింటికిన్.

ఆహా! సర్వమును కాంచనమాలకు ధారవోసితి. అన్నపానీయంబులకుఁ దూరమైతి. కులాంగనను గోల్పడితి. బంధుజనంబులకుఁ బగవాఁడనైతి. ప్రజలకు తృణప్రాయుఁడనైతి. కట్టా! తుదకు నేను మూడు దినములనుండియు యింతకూడు దొరకక క్షుద్బాధచే మిగులగాసిలుచు కృశించియుండితి. పూర్వపరిచితురాలగు నా కాంచనమాలయైన యింత కబళముఁ బెట్టకుండునా? యని నమ్మివచ్చితి. ఆమెయు నేమనునో? ఏమి నావెఱ్ఱి? కాలముదీరినను, ధనహీనతసమయమునను, స్నేహితు లుందురా? గౌరవముండునా? తుదకు కడజాతివాఁడు నైతము తనకన్న హీనునిగఁ జూచును. ఇంతయేల? కాంచనమాలనుబిలచెదగాక. (తలుపు తట్టుచు) కాంచనమాలా! కాంచనమాలా!

[ప్రవేశము: కాంచనమాల.] (ఒకవైపునుండి)

ఎవ్వడవునీవు? కాంచనమాలా యని ఖండితముగ బిలచు చుంటివి. నీవెవ్వడవు ?

ప్రతా॥ కాంచనమాలా! ఇంతలోనే మరచితివా ?

కాంచ॥ ఎవ్వడవో యెఱుంగము. ఆవలకుఁబొమ్ము.

ప్రతా॥ కాంచనమాలా! మనవి.

గీ. కూడుదిని నేటికిని నేను ♦ మూడునాళ్లు
లెంటుదొరకక కబళంబు ♦ లిందు జేరి
వేడుచుంటిని పట్టెడు ♦ వేయవమ్మ
మానినీమణి! కాంచన ♦ మాల! నాకు.

కాంచనమాలా! ప్రాణములు పోవుచున్నవి. అంతప్రసాద మొసగితి వేని దానినోటనిడుకొని నాత్రోవను నేను పోయెదను. పూర్వస్నేహమైన దలపుమా?

కాంచ॥ బుద్ధిహీనుడా! నీవు నాకు పూర్వస్నేహితుడవా? నోరుమూసికొనుము. ఈతూరిట్లుభాషించిన తగిన బుద్ధిఁ జెప్పించెద పొమ్ము. సాదము లేదు గీదము లేదు. (అని లోనికిపోవును)

ప్రతా॥ అక్కటా! ప్రతాపసేనునకీవేశ్యాస్నేహమువలన నెట్టిగతిగల్గినది తుదకు నొక్కమెతుకైన దొరకక క్షుద్బాధచే కుంది ప్రాణములు వీడవలసెనే? హా! దైవమా! ఎంతనిర్భాగ్యుఁడ.

సీ. తండ్రితిద్దినమైన ♦ దలఁచక మదిలోన
వెలకాంత చెంగట ♦ మెలగినాడ
భార్యసౌందర్యంబు ♦ భావమందెంచక
వేశ్యకాంతకుఁ జిక్కి ♦ వెలసినాడ
కులగౌరవమిసుమంత ♦ గోల్పోవుటెరుగక
భోగకాంతకుసేవ ♦ బూనినాడ
రాజ్యమంపె ప్రజల ♦ రాయిడినరయక
పణ్యాంగనగృహాన ♦ పండినాడ

గీ. యింతకును బుద్ధిలేక రో • యింతి చెంత
జేరి నేనిట్టి కష్టముల్ • దీరిపోవ
కుండునట్లుగ జేసుక • మండినాడ
వేశ్యలను గూడువారికి • వెతలివియెక ?

ఓ భారతీయులారా ! సోదరులగు నో వివిటులారా ! ఇదియంతయు నాయనుభవముచే నుగ్గడింపుచుంటి.

సీ. ధనమంతయునులాగి • తన సేవకునిజేసె
వెలకాంత పొందింక • వలదు వలదు
రాజ్యమంతయుమాపె • రాజస మెడబాపె
వెలకాంత పొందింక • వలదు వలదు
పట్టెడన్నమబెందు • పుట్టకుండగజేసె
వెలకాంత పొందింక • వలదువలదు
సన్యాసివేషంబు • నన్యాయముగవేసె
వెలకాంత పొందింక • వలదు వలదు

గీ. వేశ్యకాంతను గూడనీ • వెతలు నాకు
వచ్చిచేరెను కటకటా ! నిచ్చయముగ
సుగుణధనులార ! భారత • శూరులార !
పోకుడింకను వేశ్యల • పొందుకొరకు.

మరియు.

మ. వెలకాంతల్ కపటంపుబ్రేమ నహహా ! • వేల్ వేలు ద్రవ్యంబు లి
య్యలబెన్వేసియులాగి భిక్షుకుని గా • సింతైన లేకుండగన్
యిలువాకిండ్లను నమ్మజేతురకటా! • యిస్సీ ! మహామారులో
వెలయాండ్రన్ మరిగూడదింక యనుచున్ • వేనోళ్ళబ్రార్థించెదన్.

ఉ. గానకళాదులన్ గనియు • కామమునన్ తికిమెక్కి యెక్కువౌ
మానము మంటగల్పి మతి • మాంద్యుడనై జరియించినాడ యా
మానిని వేశ్యకాంతయను • మానములేకను జేసె భిక్షుకున్
మానిత రాజ్యలక్ష్మి! ప్రియ • మానిని! గోల్పడినాడ దైవమా !

గీ. చిచ్చుకొంపకు నిడికొని • చింతనొంద
ఫలముగల్గునె ? పుడమిలో • భవ్యులార !
గర్గెయుంపుడు గత్తెచే • గష్టవములిటు
మీఱ లైనను సద్బుద్ధి • మెలఁగుడింక.

సర్వముఁగోల్పోయిన నేనింతనీతిజెప్పినను ఏమిలాభము?తో లుత నాగురుఁడు నాకెంతయో నీతి బోధించ లేదా? నేనద్దానినివింటినా? పాపమాగురూత్తమున్నిసైతము ప్రల్లదంబులఁబల్కినది వేశ్యమాటలవిని యేగదా ? రాజ్యమందుఁగూడ నిల్వనీయక పరదేశములకుఁబారదో లినది. ఇట్టి గురుద్రోహినగు నాకిదియే శిక్ష.

[అనుబంధము 10]

నేనింక నాపాణికాంతయగు కాంతామతిని కాంతారమందు నెమకుచు ఈ సన్యాసివేషమునఁ దిరిగెద. [నిష్క్రమించును]

(పునఃప్రవేశము: కాంచనమాల.)

ఎట్టిపండితునైనను, ఎట్టివీరునైనను, ఎట్టిధనికునైనను, మోహము పదదాసునిగ జేయునుగదా? ఆహా! మోహమెంత చెడ్డది? ఈపుడమియందు వారాంగనలకులమువంటి నీచకులమును, వారివృత్తి యంతనీచవృయుత్తియు, నేకులమందును లేదు. దైవముమమ్మునుఒక్కరి కేగృహిణులగాఁజేయక పలువుర కేల జేయవలెను? ఇట్టిమా వారాంగన లెందరనో జోగులఁజేసి పడరాని నిందల పాల్బడు చుండిరి. ఔనౌను! ఇందు మావేశ్యల లోపమేమున్నది?అంతయుఁబురుషుల దే లోపము. ఏమన. పిత్రార్జితములగు మడిమాన్యములమ్మి మాకొసం గుమని వేశ్యలు విటులను బాధించిరా? ఇపుడు మావేశ్యాకులమందుఁ గూడ సంఘముల స్థాపించి వ్యభిచారవృత్తిఁ బారదోలవలయునని పా టుపడుచుండిరి. చాలవరకు సంఘ మభివృద్ధిలోనేయున్నది. ఇప్పుడు వ్యభిచార దేవత నానాటకుంది కృశించి క్షీణదశ నందుచున్నది. వ్యభి చారమన్న మాకులమందుననే గాని మరి యేకులమందును లేకుండె. నిపుడన్న సర్వకులములయందునుఁగలదు. శ్రీమంతులు సైతమిదే జే

యుచుండిరి వారికిఁగట్ట బట్టయు, దిన మెతుకును లేదా ? ఓభారతీయ సోదరీమణులారా ! వారకాంతలారా ! నామనవి వినుడు.

సీ. అశనమ్ము దొరకక • వెసమానమును నమ్మి
కాలంబుగడపెడి • కాంతలార!
అర్థమ్ము కైపహో • యాశ జెందుచునుండి
వరులకూటమిగోరు • పడఁతులార!
తుచ్ఛసుఖముఁగోరి • దోష మెంచక విటు
లనుగూడి సుఖయించు• లలనలార!
రోగినైననునరే • భోగింపడబ్బుకు
చూచుచుండెడి తుఁచ్ఛ • సుదతుఁలార!
గీ. పాపభూయిష్టమైన యా • పాపువృత్తి
విడిచిపెట్టుదురంచునే • వేయుగతుల
వేడుచుంటిని ప్రియులార ! • వెలదులార !
భారతభవులార ! వఁణులార ! భామలార !

ఇట్టి వ్యభిచార వృత్తివలననే పరదేశ వ్యాధులగు నంటువ్యాధులచే క్షీణించి తుదకు సంతానహీనులగుటకుఁగూడ కారణము. మరియు.

సీ. కులకాంతలనుబాసి • కులధర్మములరోసి
సానిపంచలఁజేరు • చపటలార !
పిన్నపెద్దలటంచు • నెన్నకమాదిలోన
వెలకాంతలనుజేరు • వ్యర్థులార !
పూర్వార్జితములెల్ల • పూజ్యంబుగానమ్మి
రాగమ్ముచేఁజెడు • జోగులార !
ధనధాన్యములుఁజెల్ల • దాస్యవృత్తినిబూని
కాపురమ్ములులేని • నాపలార !
గీ. వలదు వ్యభిచారవృత్తిచే • గలుగునఘము

వేశ్యాకాంత భోగంబుచే • వెతలుగల్గు
మానుడదియని ప్రముక్కెద • మాన్యులార !
సుగుణధనులార ! భారత • శూరులార !

వ్యభిచారవృత్తిచే యఘంబు గల్గుననియు, యశంబు పోవునని యు మనసనాతన ధర్మములు బోధించుటలేదా? అందు వేశ్యాసంపర్కముచే గల్గు నష్టకష్టములు కనులార జూచితిరిగదా? ఇంక వేశ్యలం గోరకవారిస్నేహముఁ జేయకుందురుగాకయని వేవిధములఁ ప్రార్థించెద.

[అనుబంధము 11]

(నిష్క్రమించును.) [యవనికజారును]

---

ద్వితీయరంగము-కాంతామతి సౌధము.

:0:

[ప్రవేశము: కాంతామతి] (సౌధమందాసీనయై)

(అనుబంధము 12.)

ఆహా ! దుష్టుడగు యీ దుర్బుద్ధిరాజుచేఁజిక్కి నేఁటికారుమాసములైనది. తొలుత వానితో నారుమాసముల నారురోజులు గాఁవ్రతము సేయవలయునని యాతని సమాధానపరచితిని కట్టా! నేటికారు మాసములు గతించె. నింక నారుదినంబులే గడువుగలదు. ఈమాసములనుండి యనేకు లీవ్రతదానముల కొరకును, భుక్తమునకును, నేత్రోత్సవముగఁదిలకించుటకును,లెక్కకు మిక్కుటంబుగ వచ్చుచుండిరి. కాని అందు నాప్రాణకాంతుని యాగమనము లేదయ్యో! హా! దైవమా! యీయారుమాసములనుండి రాని నాప్రాణేశ్వరుఁ డీయారుదినములలో వచ్చి ననుఁగాపాడునా ? అసంభవము ! అసత్యము ! హా ! నాథా !

[ ప్రవేశము: ప్రతాపసేనుఁడు ]

(అనుబంధము 13)

హా ! కాంతామతీ ! నేనెంతపాపుఁడ. ఎంత క్రూరుఁడ. ఎంతనీచుఁడ. కనుక నే నాకీగతి గల్గినది.

కాంతా॥ (తనలో) ఈమహానుభావుఁజూడ నా ప్రియకాంతునిపోల్కి గానుండె. అయ్యో నాకంతటిభాగ్యముగల్గునా ? ఒకరినిఁబోలి మరియొకరుండరా ? ఐన యీయన సమాచార మేమియో నడిగి దెలిసికొనియెద. (ప్ర) అయ్యా! మీరెవ్వరో యెరుంగ. కాంతామతి, కాంతామతి యని మిగుల దుఃఖించుచుంటిరి. ఆమెకును మీకును నేమైన బాంధవ్యముండెనా ? తెల్పుడు.

ప్రతా॥ మహిళామణీ ! నీవెవ్వరిదానవో నేనెరుంగ. నాప్రియకాంత కొరకై వనముల ద్రిమ్మరుచుండ, అందు దూర్వాసమహాముని నన్నుంగని నావృత్తాంతమంతయాలించి " ఓయీ నీభార్య మహాపాలకపురమున నీకొరకై గౌరీవ్రతము సేయుచున్నది " అని నుడువ నేనీపట్టణముఁజేరి వెదకివెదకి వేసారితిని నాకాంతజాడ దెలియదయ్యె ? శరీర మలయుటచేత యీతిన్నెపై శయనించి యెల్లి నెమకుదమని నిందు జేరితిని! ఇదియె నావృత్తాంతము.

కాంతా॥ (స్వ) ఇదంతయు నావిషయమైన చరిత్రవలెనే యుండినది. ఐన నడగి దెలిసికొనియెద. (ప్ర) మహాత్మా ! నీభార్య యేకారణమున అడవుల పాలయ్యెనో దెల్పవేడెద.

సీ స మా లి క.

ప్రతా॥ సీ. కాంచనమాల్యరో • కాంతయింటికిఁజేరి
జెప్పినట్లెల్లనే • జేసినాడ

కాంతా॥ అయ్యో! ఎంతమోహమునఁబడితిరి ? అట్లుసేయదగునా ? ఆపైని?

ప్రతా॥ పరిణయంబునులేక • బ్రహ్మచారిగనుండఁ
గూడదటంచని • గురుడుబల్కె

కాంతా॥ ఆహా ! అతడెంతపుణ్యాత్ముడు.

ప్రతా॥ బలవంతముగ నాకు • బరిణయంబొనరించఁ
గారాగృహముననా • కాంతనిడితి

కాంతా॥ పాపమాకాంత నెట్టి కష్టములపాలు గావించిరి ? పైని?

ప్రతా॥ అంధురాలనివిని • యూచలిఁజూడక
కానకంపినయట్టి • కలుషమతిని

కాంతా॥ (స్వ)హా! దైవమా! అంతయు నాచరిత్రమేగదా! పిమ్మట నేమి జెరిగెనో? (ప్ర)తరువాత ?

ప్రతా॥ నారాజ్య ధనధాన్య • మూరాము గ్రహియించ
సర్వముశూన్యమై • జరుగబడియె

కాంతా॥[స్వ]కట్టా!ఎంత మరవస్థ(ప్ర)అటుపిమ్మట!

ప్రతా॥ కూడునీళ్ళకువాచి • వేడఁబోవగనది
జేరనీయకఁగొట్టెఁ • జెప్పనేల?

కాంతా॥ [స్వ]హా!దైవమా!తుద కిట్టిగతిఁ గల్పించితివి?(ప్ర)పిమ్మట?

ప్రతా॥ గీ. అంత కానకువచ్చినా • కాంత యెందు
నున్నదంచును వెదకుచు • నున్ననన్నుఁ
గాంచి; దూర్వాసుడన్నని • కనికరమునఁ
దెల్పిపోయెను సకలంబు • దేటపడగ.

అంతనగరముఁ బ్రవేశించి నాప్రియకాంత కాంతామతిని వె వెదకుచుంటిని గాని కాంచనైతిని.

కాంతా॥ మహాత్మా !

గీ. మిమ్మువిడనాడి వనములోఁ • మెలఁగి పిదప
వైశ్యుచే జిక్కి వానిని • వదలుచుకొని
మూర్ఖుడైనట్టి యీరాజు • ప్రోలబడియు
గుందుచుంటిని మీకునై • డెందమందు.

ప్రాణేశ్వరా ! తొలుతమీరు జెప్పిన నిర్భాగ్యురాలగు కాంతామతి యిదియే నాథా ! వినుము ఈదుర్బుద్ధిబారినుండి దప్పించుకొన నావశము గాక " యారు మాసముల యారు దినములునాకు గౌరీవ్రతముగలదు. ఆపైని నీయిష్టము " అని నుడివి నాపాతివ్రత్యమును గాపాడుకొనియీయారు మాసములనుండి మీకొరకైఁ జూచుచుంటిని. నేటికారుదినములు గడువుఁగలదు. యింక మీకువ

చ్చుట కల్లయని దుఃఖించుచుంటిని. నాపుణ్యవశముచే నేఁడు మీసుందర వదనారవిందముఁ దిలకించు భాగ్యమబ్బినందుకు సంతసించితిని.

ప్రతా॥ అయ్యో! కాంతామతీ! నీవీ నిర్బంధమునుండి దాటుటెట్లు? నన్నుఁగూడుటెట్లు?

కాంతా॥ ప్రాణేశ్వరా! నేనొక్కటిఁ దెల్పెద వినుఁడు. నేటినిశీథమున నిశ్శ్రేణిసహాయమున నేమీచెంతకుఁ జేరెద. గావున మీరిందే శయనింపుఁడు. మౌనము ధరింపుఁడు. యీ జాడ దుష్టబుద్ధికిం దెలసిన కార్యభంగము కాఁగలదు. ఇంక శయనించుఁడు.

ప్రతా॥ ప్రాణేశ్వరీ: మరచెదవేమో?

కాంతా॥ ప్రాణేశ్వరా! మీకొరకెదురు చూచుచున్ననేను మఱతునా? ఇంక నిదురింతునా?

ప్రతా॥ (శయనించును.)

కాంతా॥ (స్వ) నేఁటికి నానోముఫలించినది. నావ్రతము ధన్యతనొందినది. నేఁగృతార్థురాలనైతి. పెరలకంటఁ బడకుండ నీయర్థరాత్రి యిందుండి నానాథునిఁగూడి మార్గముఁ బట్టెదగాక.

(ప్రవేశము: దొంగ.)

యియ్యాలకి మూడురోజులమించి యాడదిఁగినాయాం లేదు. కారణం యేందో తెల్దు అన్నెంపున్నెం యేం యెరగ. అంకాళమ్మను, పోలేరమ్మను, గంగానమ్మను, మాలచ్చుమ్మను, అంకమ్మను, మరిగత్తె, పోతరాజును, అందరికి మొక్కేవత్తుండాను. నేను మొబ్బేటకొచ్చియన్న డిట్టా వూరికె మోలేదబ్బా! యీమూడురోజులమించి ఓరి మొగం సూత్తుండానోగాని మొబ్బేట దొరకటంలేదు. అసలు నేను దొంగల్లో మొనగాణ్ణి. నేపుట్టిన గడివె అసువంటిది. మిట్టమద్దేల జాంపొద్దుకాడ. పోద్దుకూకేల, జాంపొద్దుపోయి మరిగత్తే అద్దంరేత్తిరి కాడ నిద్దరమత్తులో అమాశనాడుపుట్టేను. అమాసనాడు పుడితే మంచిదొంగతనంఅబ్బుద్ది. అమ్మతోడు. ఇయ్యాల కుద్దేవతని యేసుకొని మొబ్బేటకెల్తా

కీర్తన.

గంగావమ్మ ! పోశేరమ్మా ! కరుణిచ్చినఁగావువమ్మ॥ గం॥
ఆరుకాళ్ళా జీవమిపుడె=యరవగాను బలియునిత్తా
ఊరియున్నా కల్లుదెచ్చి = వారబోతు తల్లిరో! ॥గం॥
వొంగివొంగి కన్న మేచి= ఒడుచుకొత్తా చొమ్ములన్నీ
దొంగతనానికియెల్తా = తోడురావెతల్లిరో ! ॥గం॥

ఇంకాపోతా యీమేడ కేకన్నా మేత్తా.(పోవుచు ప్రతాపసేనునిఁ జూచి) యీడోడో పండుకుండాడు యీడికాడ యేమన్నా ఆశపాటు సూసుకుందాము. (నెత్తిపై గుడ్డఁదీశి విచ్చిచూచి) ఛీ! యదవనా యాలా లంతాసినిగిందే ? (చూచి) ఓరిబాబో యీడోడో సన్నా చోడు. ఛీ! యీడిమొగం సూడఁగూడదు. దరిద్రపెదవ యీమేడ కియ్యాల బొక్కడతా. (కన్నంవేసి అందుకాళ్ళుపెట్టును తేలుకుట్టును.)

కీర్తన.

తేలుగుట్టింది = అబ్బో తేలుగుట్టింది = నల్లతేలుగుట్టింది =అహా తేలు [గుట్టింది॥
తేలుపాడుగాను బాగ = కాలికిగుట్టింది అబ్బా = నల్లతేలుగుట్టింది = [నన్ను తేలుగుట్టింది॥
వజ్రమేళనేనులేసి = వొచ్చానో పోడుగాను= తేలుగుట్టింది
అబ్బా తేలుగుట్టింది = నల్లతేలుగుట్టింది = హా! తేలుగుట్టింది॥

కాంతా॥ (చప్పటులుఁ గొట్టి) ప్రాణేశ్వరా ! ప్రాణేశ్వరా ! మాటలా డక యిటురండు. నడురేయి మీరినది.

•(అనదొంగ చెంపకుఁబోవును. కాంతామతి మేడదిగిలోనకుఁబోవును)
(యవనికజారును.)








ప్రథమరంగము: అడవి.

(ప్రవేశము: దొంగ, వానివెంట [కాంతామతి.]

దొంగ; (అరణ్యమధ్యమున నిలచి మాటలాడకుండును)

కాంతా॥ ఏమిది. నానాథుడేయని మోసపోతినే? అయ్యో! యెంత గ్రహచారము. (అని వణకుచు దొంగనుజూచును)

దొంగ॥ (కదలకుండ గ్రుడ్లు ద్రిప్పుచు నిలచియేయుండును)

కాంతా॥ (భయముతో) అయ్యో! ఇదియేమి? నాప్రాణేశ్వరుడని నమ్మి మోసపోతినే? హా! మాల్లదైవమా! ఇంకను నాకడగండ్ల గట్టుపట్టింపక బాధించుచుంటివా?

దొంగ॥ (పైరీతిగానేయుండును.)

కాంతా॥ (భయముతోజూచి) చూచుటకు నల్లగ నొక మొద్దురీతిగ గన్పట్టుచున్నది. యిదేదైన యడవిమృగమైయుండునా? అడవిమృగమైన యిట్లేల నిలచియుండును? కాదు కాదు. (మరల చూచి) అడవిమనుష్యుడైయుండునా? అడవిమనుష్యుడైన వికారరూపముగ నుండడా? ఆ. స్ఫురించినది. కొరవిదయ్యములు నల్లగనుండుననియు, మాటలాడక మొద్దువలె నిలచియుండుననియు, మాతల్లిదండ్రులు నాచిన్నతనమునఁ జెప్పియుండిరి.

ఇదిగాక అవి ముఖ్యము నిర్జనప్రదేశమందే యుండుననియు నుడివిరి అటులనే యెవ్వరును సంచరించని యీఘోరారణ్యమునకు నన్నురప్పించినది.

(అని దగ్గరకుఁబోయి మరలఁ జూచును.)

దొంగ॥ (పైరీతిగనే యుండును.)

కాంతా॥ అయ్యో ! దైవమా ! నాకింక తెరువెయ్యది. ? ఆదుర్బుద్ధి బారినుండి తప్పించుకొని ప్రాణముల నిల్పుకొంటినిగదాయని సంతసించితిని. ఇది భూతమో అడవిమనుష్యుఁడో యిపుడి చటనుండి తప్పించుకొను నుపాయము దోపక మిగుల భీతిఁగొల్పుచున్నది. (ముందుపోయి వెనుకకేగును.)

దొంగ॥ (పైరీతిగనేయుండును.)

కాంతా॥ (దొంగమోమునుజూచి) అయ్యో ! అవలకుఁబోవుదమన్న నీభూతమునుఁ జూచినదిమొదలు కాళ్ళు వడకుచున్నవి భీతిగొల్పుచున్నది. నాకేమియుఁదోచుట లేదు.

(అని మెల్లగ నావలకుఁ బరుగిడును. లోన పెద్దధ్వని గల్గును)

దొంగ॥ కీర్తన.

సిక్కేవు సిక్కేవులే=సక్కానిపిల్ల ॥సి॥

ఎక్కడికిపోతావు ? యేందదిసెప్పింక = యెట్టైన నిన్నిడవనే పిల్లో
యెట్టైన నిన్నిడవనే)

పెళ్ళినన్ను సేసుకుంటె వొళ్ళెల్లసొమ్ములెడత = కల్లంత తెచ్చి
పోత్తనే పిల్లో పిల్లో ॥సి॥]

నక్కాజత్తులమారి = నామెత్రిపిల్లో సిక్కేవు సిక్కేవులే

పిల్ల పిల్ల పిల్లో సిక్కేవు సిక్కేవులే సక్కానిపిల్ల ॥సి॥

కాంతా॥ (స్వ) ఏమిది ! వీడు నిక్కముగ మనుష్యుడేయై యుండును.

దొంగ॥ [స్వ]తొలింబరంగ నన్ను నూసి పేణేశా ! అన్నది. నానంత సొగ్గావుండాగామాల్సు ? కామించెనాసోకు. నాటాకు. నా

టీకు సూసినన్ను మోయించి పేణేశా! అంటూనాయంబడి ప
డ్డది. నేనంత సొగ్గావుండాగామాల్సు ?

(అనివికటముగ నవ్వును)

కాంతా॥ ఓరీ! నీవెవ్వఁడవు ?

దొంగ॥ నే నే.

కాంతా॥ నేనే యన నెట్లు తెలియును ? వివరముగ జెప్పుము.

దొంగ॥ యహై! నేనే నంటే తెల్దు ?

కాంతా॥ బాగుగానున్నది. పోనీ నీవర్ణమేమి ?

దొంగ॥ నావర్ణం నీలవర్ణమే.

కాంతా॥ సరి సరి. అడవి మనుష్యుఁడన్నందుకు సరిపోయినది. (ప్ర) వర్ణమనగా కులము. తెల సెనా?

దొంగ॥ అట్టా సెప్పరాదు. మరి మబ్బేటకులం

కాంతా॥ మబ్బేట కులమనగానేమి ? సరిగ జెప్పుము ?

దొంగ॥ యహై! మబ్బేటకులమంటేను

కాంతా॥ నీ వృత్తియేమి ?

దొంగ॥ యిదే

కాంతా॥ ఓరీ! ఇంకనీతో నీవుఁబొమ్ము అధిక ప్రసంగంబుతోఁ బనిలేదు

దొంగ॥ ఇదిగో! మరిగత్తే పేణేశా! అనినన్ను మోహించి నాయం టబడి యిప్పుడేడకెల్తా? నన్ను పెళ్ళిసేసుకోవు ?

కాంతా॥ నీకుఁబెండ్లి కావలెనా? నీరూపమునకుఁబెండ్లియే తక్కువసుమా?

దొంగ॥ తక్కువో? ఎక్కువో? నన్ను పెళ్ళి సేసుకుంటావా లేదా?

కాంతా॥ ఓరీ ? నీకొక్కమాటఁ జెప్పెద వినుము. (స్వ) వీనిబారినుం డి యెట్లుగా తప్పించుకొందును ?, యేమియుఁదోచుట లేదే ?

దొంగ॥ ఏందది? సెప్పు సెప్పు యింటాను.

కాంతా॥ పెండ్లి చేసుకొనుటకు నీకును నాకునుఁ బేధముఁగలదు. అందుచే కుదురదు.

దొంగ॥ బేదం అంటే?

కాంతా॥ నల్లనిరూపుచే చూచుట కసహ్యముగ మలినవస్త్రములతో నుండు నీకెట్లుగా పెండ్లియగును?

దొంగ॥ నాకంటె సోగ్గావుండావేం? యిదుగో! మాటిను.

కీర్తన.

నల్లోడుఐతేను=నాణెమని అంటారు? నా మూటయినయేపిల్లా చక్కానిపిల్ల నామాటయినయే పిల్లా.

హాయ్. హాయ్. చీరాము లెట్టుండెనే? చెప్పవే పిల్లో చీతమ్మ యెట్టుండెనే?

పిల్ల పిల్ల ల్లో కుక్క-మూతియట్టుండెనే? చెప్పవే పిల్లో చెప్ప వేపిల్లో? రుక్కిణమ్మయెట్టుండెనే?

కాంతా॥ నీకు నిజముగా పెండ్లిగావలెనా? అట్లయిన షోకుగా ఉండవలెను. మంచిడ్రెస్సులు వేసుకొని బంధుసహితముగ రావలెను

దొంగ॥ బంధుసహితం అంటే?

కాంతా॥ చుట్టాలతోగూడా

దొంగ॥ అట్టాగే పిల్చుకొత్తాగాని నువ్వొల్లాయేమొ. యెత్తే?

కాంతా॥ వెళ్ళనుగాని మంచిడ్రస్సులతోగూడ రావలెను.

దొంగ॥ మంచియిలేయ్యేనాకు.

కాంతా॥ ఐన పోయిరమ్ము.

దొంగ॥ యెల్లాయేమొ.

కాంతా॥ నేనెచ్చటికిఁబోయెదను? నీకొరకై యిచ్చటనే యుండెదను. తీవ్రముగరమ్ము.

దొంగ॥ నువ్వొల్లాయేమో. ఇమగో నీపేరేంది? సెప్పుమరి.

కాంతా॥ రాజాధిరాజ సార్వభౌమ ప్రతాపసేనరాజేంద్రుని దేవేరియగు కాంతామతీదేవి!

దొంగ॥ అబ్బో ! అంతపెద్దదా ? నాకురాదు సిన్నదిసెప్పు ?

కాంతా॥ ప్రతాపసేన రాజేంద్రుభార్యా, కాంతామతిదేవి.

దొంగ॥ బాబో ! యింకాపెద్దదే యింకోటిసెప్పు ?

కాంతా॥ సరే కాంతామతీదేవి.

దొంగ॥ ఊహూం ! యింకాసిన్నది.

కాంతా॥ కాంతామతి

దొంగ॥ అది నాకురాదే ?

కాంతా॥ నేజెప్పెదపల్కుము. కా ం తా మ తి(ఒక్కొక్కయక్షరముఁ జెప్పును.)

దొంగ॥ పైరీతిగాఁబల్కును. (కొంతసేపటికి వ్రేళ్ళు లెక్క పెట్టుకొని) గంత యికరాదు

కాంతా॥ పోనీ యట్లనేబిలువుము.

దొంగ॥ (స్వ) గంత గంత గంత యిదుగో ! యెల్తాయేమె

కాంతా॥ నేనెచ్చటికివెళ్ళను నీవుమాత్రము తొందరగా రావలెను

దొంగ॥ యిదుగో యెల్తుండ. పోతుండ. మల్లొత్త మాకెల్తాయేమె.

కాంతా॥ అబ్బ ! పొమ్ము. నమ్మవా? నమ్మకున్న నీకింతియే?

దొంగ॥ యెల్తుండ. పోతుండ. నువెల్తాయేమె. అట్టాగాదు, నేగిరిగీసి యెల్తా. (కాంతామతి చుట్టుగిరిగీసి ఉమ్మివేయుచు పోవ బ్రయత్నించి) యిదుగో ! యెల్తా. పోతా. నువెల్లమాకె నానిప్పుడేవత్తా (నిష్క్రమించును)

కాంతా॥ అబ్బా! వీనిబాధ పడలేక విసిగిపోతిని వీనినిఁజూడ నవ్వును, నాగతిఁదలంచ దుఃఖమును వచ్చుచున్నది. [అటువిటుఁజూచి] నేనింక యిందు నిలువఁజనదు మరల యామార్గముఁ రాగలఁడు. వాఁడు రాకమున్నె వేరొకమార్గమునఁబోయెద. హా ! దైవమా! ఎట్టియిక్కట్టులఁ బెట్టుచుంటివి ?

(పునఃప్రవేశము: అదే స్థలమున దొంగ వానిబందుగులు మేళములో)

1 అన్నా ! మావదినేది ?

2 మామా ! మా అత్తేది ?

3 బావా! మా అప్పేది ?

4 తమ్ముడా! మరదలేదిరా ?

దొంగ॥ యహై! ఉండదిలే అరవమాకండశే.

(బందుగులందరు కలసి పాటలుపాడుచు పంచరంగులఁదెచ్చి ముఖము నకు, శరీరమునకు రాచెదరు)

1 అన్నా! మావదినె యెక్కడున్నదో తీసుకురా !

దొంగ॥ అల్లదుగో ! ఆపొదసాటున కూకోమెట్టే సెయ్యికుట్టి లాక్కురా. పో.

1 (పోయిచూచివచ్చి) ఎల్లిగ మల్లిగ పుల్లిగో! అంతావుత్తదేరో దొంగెదవ మన్నికూడా తీసుకొచ్చాడు. [అని కొట్టును]

అందరు॥ యదవా! అబద్దాలుసెప్పి పిల్చుకొత్తావా? [అనికొట్టి నిష్క్రి]

దొంగ॥ గంతా! ఓగంతా! ఓగంతా! (అనియేడ్చుచు) సీతల్లెమ్మ చిగ్గొయ్య మాయమాటలుసెప్పి మంచిజెరుసు వేసుకురామని సెప్పకుండెల్లే ? నిన్నియడియిలో పట్టుకొక పొయ్యానంటే నేదొంగనేనా ? మరిగెత్తెనేన్నె నేనా ? యెల్తాపెళ్ళిసేసుకొత్తా.

(నిష్క్రమించును. యవనికజారును.)





శ్రీ

# కాంతామతి

## పంచమాంకము.



ప్రథమరంగము. అడవి. (మఱొకభాగము)

[ప్రవేశము: కాంతామతి.] (విషాదముతో)

(అనుబంధము 14.)

అయ్యో! నేనెంతపాపురాలను?

చం. వెలయుఁగమున్న దంపతుల • వీడఁగ తంపులుపెట్టఁబట్టి భూ
తలమున నట్టిపాపఫలి • తంబాగినేనను భావ్యమందితిఁ
నిలువఁగనీడలేకమఱి • నీళ్ళును, గూడును లేక సర్వదా
యిలఁ జరించుచుంటినిఁక • నింతలు జర్గునటంచెఱుంగనే.

కట్టా! దైవమా! ఇంతవరకుఁ ముప్పురచేఁ బడరాని పాట్లు పడితిని. ఇఁక ముందైన నాకష్టములు గట్టువట్టునా? ఏమి నావెడఁగు? నాయట్టి నిర్భాగ్యురాలికిఁ గష్టములు తొలఁగునా? కల్ల. నేధన్యురాలనైయైన నాపతిచెంతనే యుండుదానగదా? యిట్టికష్టముల కేల లోనౌదును.

గీ. భాగ్యహీననుగాఁబట్టి • పతినివీడి
కుంది కృశియించుచుంటినా • డెందమందుఁ
గటకటా! కాననములనా • కంజజాతుఁ
డుండుమని వ్రాసెఁగాఁబోలు • నొప్పిదముగ
మూఁడుపంక్తుల నుదుట స • మ్మోదముతోఁడ.

హా! ప్రాణనాథా! నీసుందర వదనారవిందముఁ జూచుభాగ్య మీజన్మమున నిర్భాగ్యురాలనగు నాకుఁగలదా? కల్ల. మందభాగ్యురాలనగు నేనెట్టి పాపము లొనర్చితినోగాని ఎందుఁజూచినను అన్నియు నశుభములే. ఎందుఁబోయినను అన్నియు సంకటములే? ఇంక నేనేమిసేయుదు? హా! ప్రాణేశ్వరా! నీప్రియకాంతను కావరావా?

ఉ. నాథుని మెట్టినిల్లు మరి • నాతలి దండ్రుల సోదరాదులన్
మోదముగూర్చు నాసఖుల • ముచ్చటలాడెడు రాజకీరముల్
నాదయివంబుజాలక న • హా! విడనాడి యహర్నిశంబు నీ
బాధలనందనాయె? నిఁకఁ బ్రాణము • బోదుగదాయె? దైవమా!

హా! నిర్భాగ్యురాల నిర్భాగ్యురాల (ముందునడచును)

[ప్రవేశము: రాజకుమారులు] (ఇద్దరు ఒకవైపున)

1. మిత్రమా! నీకన్న నెక్కుడు మృగముల నేనే సంహరించితిని.

2. ఇట్టి యనృతములాడకుము నీవా మృగములతోఁడ బహుగిడి జాల కుండుటచే ప్రతిమృగమును నేనుగదా కోలంగూల్చినది?

1. వీటికేమిగాని అటుఁజూడుము.

2. ఔరా! యేమిదాని యొయ్యారము? నామనము తత్తరించుచున్నదే?

1. సఖుఁడా! దాని మాటలాడించి చూతమురమ్ము. (దాఁపుజేరి) చెలీ! నీవెవ్వరిదానవు? ఒంటరిగ నీఘోరాటవులం ద్రిమ్మరు గారణమేమి? నీ మగఁడెవండు? సర్వముఁదెల్పుము!

కాంతా॥ అన్నలారా! కర్మవశమున నీయరణ్యములఁ ద్రిమ్మరుచుంటిని. నావిచారణ మీకేల? మీమార్గమున మీరు పొండు.

2. (కనుసైగజేయును.)

1. చెలీ! నీకథయెల్లఁ జెప్పక దాచితివి. కానిమ్ము. వంట యింటి కుందేలువలె మాచే జిక్కితివి. యింకెందుబోఁగలవు?

(అనుబంధము. 15)

2\. సీ. నిను బాసినేనింక • నిలువజాలనె బాల
కోరికఁ దీర్చలే • కుందరదన!
1\. కనకాంగి! నీవీటు • గన్గొన మదికి సం
తాపమాయెనికట్లు? • తాళుదకట
2\. సరసిజనేత్రి! నీ • సౌందర్యమారశి
యంత, గలకఁ జెంది • తబ్జపాణి
1\. సతులనసేకుల • క్షితితలంబున గంటిఁ
గానినిన్బోలిన • కాంతఁజూడ
2\. గీ॥ మోవి చక్కెర రుచిజూపు • ముద్దుగుమ్మ!
1\. నీదు కౌఁగిటననుజేర్చు • నీలవేణి!
2\. మరునిదాడికి నోర్వనో • మందయాన!
1\. నన్ను గరుణించిబ్రోవవే • వన్నెలాడి!
2\. కలికీ! మాకోరికఁ దీర్చునది నిన్ను పిడుచుటకల్ల. గావున నీవీ కార్యమున కంగీకరించుము?

కాంతా॥ హరిహరీ! (చెవులుమూసుకొని) ఎంతమాటలాడితిరి.

శా. అన్నా! మీకును నేనుసోదరిని • మీయంబ్రఘుల్ దగ్గ గొల్చెదఁగ
నన్నీరీతిని గోరగాదగునె? • యన్యాయంబుగా! నిట్లు, గా
కున్నఁ మీకిలఁదోడబుట్టువులు లేరో? వార లిమ్మార్గమం
దున్నారా? యదిజెప్పుఁడీ? పిదప • మీరఁదర్వీశ్వరుల్ గారొకో!

మీరు రాచవంశజులుగారా? ఏమోనబ్బ. రాచవారైనవారిలో నింత జ్ఞానహీనులుందురా? లేకేమి? కొందఱు వావివరుసలెఱుంగని పశుప్రాయులుగలరు. రాకుమారులారా! మీకీబుద్ధితగదు. మీతోఁబ్రవను మీరుపొందు పాపము చాలశ్రమపడి మంచినీతి నేర్చితిరి మీకు నీతిఁజెప్పువారు లేరా? మీ పెద్దలకును నిదియే నడువడియా? ద్రోహులారా!

1\. కాంతామణీ! వేయుమాటలాడువారముగాము. ఎట్లైన నంగీ

కరింపక తప్పదు. లేకున్నఁగుక్కుటమురీతి యని యెంచుము ఇంక జాగునేయక లెమ్ము ఆపొదరింటికడకు పోవుదము.

కాంతా॥ గీ. పరసతులపొందు భువిఁగడు ♦ పాపమనుచు
చెప్పియుండరె ? యార్యులో ♦ చెనటులార !
యఘముగల్గును మీకింక ♦ నాయువుడుగు
పొందుటెంకికి వేగమె ♦ ప్రొద్దువోయె.

2. ఇందువదనా ! పరసతులపొందు పాపమని యెంద్వ్రాసియుం డినది ? చూపగలవా ! ఉండెనపో. తెలివిహీనులెవ్వరో వ్రాసినదిగాని తెలివిగలవారలు వ్రాసినదిగాదు

కాంతా॥ అవును వారు తెలివిహీనులు మీరు తెలివిగలవారు కను కనే యింత నీతితప్పక సంచరించుచుండిరి లోకమునవింకెన్వ రైన తెలివిహీనులుండిన మీకడనున్న తెలివినిబోధించి మీ యంత బుద్ధివంతులుగజేసి మీవెంటనే ద్రిప్పుకొనుచు యశ మార్జింపుడు.

1. గీ. మాటలేల ? ముమ్మాటికి ♦ మరుని కేళి
దేల్చుచనన్నింక; జాగేల ♦ దెరవమిన్న (పట్టుకొనబోవును)

2. వానిమాటలకేమిలే ? వనరుజాక్షి
నన్నుఁగూడితో వేవేగ ♦ నిన్నుగొలతు
(పట్టుకొనబోవును)

కాంతా ! నన్ను వివాహమాడుము నీకెందును లోపములేదు.

1. తన్వి! నన్నుఁ జేపట్టుము నీకు సర్వాధికారమొసంగెద

కాంతా॥ (స్వ) వీరికెన్ని నీతులు జెప్పినను. వినక నన్ను భంగపెట్టనెం చిరే! కానిమ్ము వీరిని కపటోపాయమునఁ దప్పించుకొను నుపాయముఁ బన్నెద (ప్ర) రాకుమారులారా ! మీకు నిజ ముగ వివాహము గావలెనా ?

1. నాకుఁ గావలెను.

2. నాకుగావలెను. (మొదటివానిని నెట్టును)

కాంతా॥ రాచగున్నలారా! మీరు పిన్నవయస్కులు నేనన్ననో పెద్ద వయస్కురాలను. మనలకు వైవాహికంబెట్లు పొసగును.

1. కాంతా! నీకన్న నేనే పెద్దవాడను. చూడుము. (అని మీసముల జూపును)

2. తరుణి! నీకన్నను వీనికన్నను చాలాపెద్దవాడను. నీవువిచారించి మరికేలుబట్టుము [మొదటివానిని నెట్టివేయును.]

కాంతా॥ ఔను! మంచియుక్తవయస్కులునాకు లభించిరి. ఆతడు బాలుడు నీవు వృద్ధుడవు మంచిదాంపత్యము. మీతోడదాంపత్యము గడుసౌఖ్యముగనుండును. చాలుచాలుపొండు (పోవఁబోవును రాకుమారు లడ్డమువచ్చి నిర్బంధింతురు)

కాంతా॥ [స్వ] వీరలనింక కపటోపాయమునఁదప్పించుకొనవలయును. [ప్ర] యువకులగు నో వీరులారా! మీకు నిజముగ నాపై ప్రేమ యున్న నేనొక్కటిఁజెప్పెద అందుల కంగీకరించి మీర ట్లొనర్పవలయు. అట్లుఁజేసెదరా?

1. అట్లనే జేసెద.

2. నీయిష్టముగునట్లు నేముందుజేసెద.

కాంతా॥ అట్లయిన ముందు మీసెస్త్రు లిందుంచుఁడు

1. 2. ఇవిగో! ముందునావి. ముందునావి (విడిచి క్రిందనుంతురు)

కాంతా॥ ధనుర్బాణములఁగూడ నిందుంచుఁడు.

1. 2. ఇదిగో! ముందునాది. ముందునాది. (ధనువులఁగూడ క్రింద బెట్టుదురు)

కాంతా॥ ఇంక వినుఁడు. నన్నుఁబెండ్లాడదలచుకొన్నది నిజమేగదా?

1. 2. నిజము. నిజము.

కాంతా॥ అట్లైన వినుఁడు యీశరమును రివ్వున వేసెదను. దాని ముందుగ నెవ్వరుదెచ్చిన వానిఁజేపట్టెదను. ఇదుగో! బాణము

విసరుచుంటిని. (బాణముఁ దీసుకొని ఒకవైపునకు విసరి వేయును రాకుమాళ్లు పర్వులెత్తుదురు) మొన్నబుట్టి నిన్న కన్నులు దెరచినవానికిఁగూడ భార్య గావలసివచ్చె. కనుకనే లోకమెల్ల యుష్ణవ్యాధులు వ్యాపించి నానాటక్షీణించి కడకుమృతులగుచున్నారు. తమ దేహపటుత్వము తామెరుంగక సంచరించు నిట్టి మూర్ఖులగతు లెట్లుండవలెనో యట్లనేయుండును. మరచినాను ఆమూర్ఖులు రాకమున్నె యీ దుస్తులను ధనువులధరించి పురుషవేషమున ముందుమార్గముఁ బట్టెద.

[ద్రస్సులనుఁ ధనువునుఁ దీసికొనిపోవును]

[పునః ప్రవేశము: రాకుమారులు.] (అదేస్థలమున)

1. (చూచి) అన్నా! ఎంతమోసగించినది? ఎన్నోనమ్మికలఁజెప్పి నమ్మించుటయ గాక దుస్తులను ధనువులఁగూడ గొనిచనెనే! కనుకనే స్త్రీజాతిని విశ్వసింపఁ దగదనియు. కంఠముఁగోసినను నమ్మరాదనియు పూజ్యులగు పెద్దలు నుడివియుండిరి.

2. అన్నా! ఆకాంతను వెదకి నీవే జేసికొనుము.

1. నాకేమియువలదులే! నీవేజేసుకొనుము.

2. ఆ. మనగతిపెండ్లివలెనే యున్నదిలే? మనదుస్తులతో సహా గైకొనిపోయినది. ఇంకమనమెట్లు పురములోనికిఁబోవుదము? దుస్తులులేక పురముఁ జేరితిమేని చూచువారెల్లరు మనల వింతగజూచుటయగాక, దుస్తుల నెందోగోల్పోయిరని గోల్లుపెట్టెదరు. గానవైన యీకాంతారమందు నాకాంతను నెమకుదముగమ్ము.

1. అన్నా! మదాంధకారముచే మనమాకాంతనుఁ గోరుటచేతనే గదా? మనకిట్టి కష్టములు గల్గినవి! పరనారులను గోరుట పాపమనినుడివియే యుండినది. పాపమామెలోపమేమియు లేదు. అన్నా! ఆపాపమిప్పుడు మనపైఁబరిణమించినది. ఇంకనుడుపులఁ

తెచ్చుకొనుటకై యానారిపోయినమార్గముఁబట్టి పోవుదము రమ్ము. మనగ్రహచార దేవతయిట్లు జేసినదిలే

(నిష్క్రమించును) యవనికజారును

ద్వితీయరంగము—ఉద్యానవనము.

—;o;—

ప్రవేశము: కాంతామతి (పురుషవేషమున శయనించి) [పుష్పములఁగోయుచు చంద్రరేఖ కొందరు చెలికత్తెలు. (ఒకవైపున

(అనుబంధము16)

చెలి॥ సఖీ! చంద్రరేఖా! నీమదికి నచ్చినపురుషసింహుఁడు నేఁడు గదాలభించినది? అదుగో! ఆలతాకుంజములచెంత శయనించి యుండిన సౌందర్య మూర్తింజూడుమా?
ఆహా! ఎట్టిసుందర వదనారవిందము.

చంద్ర॥ [చూచి] ఓ నేచెలి! ఇదివరకెందరనో రాజకుమారులఁజూచి యుంటినిగాని యిట్టి సౌందర్యమునకునికిపట్టగు నవమన్మథాకారుని గాంచఁజాలనైతి? ఓరా! ఏమిఁవీనిసౌందర్యము.

[అనుబంధము 17]

ఉ. కంతునికంటె! నైషధుని। కంటె! వసంతునికంటె! యామినీ
కాంతునికంటె! దత్తుని। కంటెఁ! గుబేరునిపట్టికంటెఁ! బా
కాంతకసూతికంటె! లలి। తాకృతినొప్పుచునుండె, మేదినీ
కాంతుడటంచునాకుఁ చెలి, కాంక్షలుగల్గెను వేయునేటికిఁ.

చెలీ!

"ఉ. వీనిముఖంబు చందురుని। వెల్వెలఁ బారఁగఁ జేయుచుండగా?
వీనివిలోకనంబులర। విందములన్ ముకుళింపజేయుగా?
వీనిభుజాయుగంబు ఫణి। వృద్ధుని నొదలవంపఁజేయగా!
వీనివిలాస సంపదత్రి। విష్టపసన్నుత మాటచిత్రమే?"

మరియు

కం. చిందమ్ముల కుందమ్ముల
కందమ్ముల గెల్చుఁబీని। గళ ర"ద కచముల్
కెందమ్ముల కుందమ్ముల
చందమ్ము లదనరుపీని। చరణము లెన్నఁ"

చెలి॥ రమణీమణీ! చక్కఁగా వర్ణించితివి నీవుచెప్పినట్లన్ని లక్షణముల చేవిలసిల్లుచుండె. యీతఁడే నీకు దగినఁబురుషుడు.

చంద్ర॥ కాంతా! ఈతని యాకృతిచూడ మోహనముద్రమునముంచుచున్నయది. ఇంకనీమోహామునేభరింపఁజాలయిటుదిలకించుము

"సీ. వదనప్రభూతలా ♦ వణ్యాంబుసంభూత
కమలంబులనవీని ♦ కన్నులమరె
నీక్కివీనులతోడ ♦ నెక్కసక్కెములాడు
కరణినున్నవి వీని ♦ ఘనభుజములు
సంకల్పసంభవా ♦ స్థాన పీఠికవోలె
వెడదమైకనుపట్టె ♦ వీనియురము
ప్రతిఘటించు జివుళ్ళ ♦ పై నెత్రవాటిన
రీతినున్నవి వీని ♦ మృదుపదములు

గీ. నేరెకేటియసల్ దెచ్చి ♦ నీరజాప్తు
సానబట్టినరా పొడి ♦ చల్లిమెదిపి
పదను సుధనిడి ♦ చేసెనో? పద్మభవుఁడు
వీనిగాఁకున్నఁ గలదె? యీ ♦ మేనికాంతి"

[కాంతుడు మేల్కాంచి]

కాంతలారా! మీరలెవ్వరు? మీనామమెద్ది? యిందురాగతమేమి?

చెలి॥ ఆర్యా! ఈమె కళింగాధీశునిపుత్రి. చంద్రరేఖ. మేమామెయనుంగు సఖులము. వనవిహారమై యిందువచ్చితిమి. మీనామమెయ్యదో? స్థానమెయ్యదో? కులగోత్రము లెవ్వియో సెలవీయ వేడుచున్నారము. మీకుకళ్యాణమగుగాక.

కాంతు॥ (స్వ) ఏమి, యీచెలి యిట్లు భాషించుచున్నది ? (ప్ర) కాంతా! రాట్కులసంజాతుండ. చోళపురీశుని పుత్రుండ

చెలి॥ దేవా! తమనామముం దెలుప ప్రార్థించుచుంటి.

కాంతు॥ నాకులగోత్రనామము లడుగుచుంటివేల ? నాతోడసంబంధ మొనర్చెదవా ?

చెలి॥ (నమస్కరించి) దేవా యాగ్రహింపకుడు. ఒక మనవిగలదు. మీరంగీకరింతురేని యుగ్గడించెద.

కాంతు॥ అంగీకరింపఁదగినదైన అంగీకరించెదను.

చెలి॥ (చంద్రరేఖనుఁజూచి కన్నుగీటును)

చంద్ర॥ ఆర్యా ! ఈకళింగ పురాధీశ్వరుండగు మాతండ్రి ముదుసలి యగుటచే రాజ్యతంత్రము కుశలముగ నడుపతగు రాకుమారుఁడు లభింపమిం జేసి సంతాపమందుచుండె. మరియునా:—

(తలవంచి సిగ్గుపడును)

కాంతు॥ తరుణీ ! లజ్జించదవేల ? యిది లజ్జించుటకదనా ? చెప్పదలచినదాని సాంగముగాజెప్పుము. ఇందన్యులెవ్వరుండిరి ?

చెలి॥ అయ్యా ! ఈరాజ్యభారమును మీభుజస్కంధముల నిడుకొని యీమెను వివాహమాడుమన్న యీమెకోరిక. మీరిందుల కంగీకరించి యీమెనుఁ జేపట్టవలయును.

చంద్ర॥ (చెలికత్తెను చాటుచేసుకొని) భూజానీ ! ఇదియే నాకోరిక ఇంక నాముద్దుచెల్లించి నాకును యీకళింగరాజ్యలక్ష్మికిని నాథులగుదురు గాకయని ప్రార్థింపుచుంటిని.

కాంతు॥ సఖీ ! నీకోర్కెయందొండు తీర్చెదను. రెండవదాని యర్ధవత్సరముకుఁగానిఁ దీర్పజాలమన్నింపుము.

చంద్ర॥ ఆర్యా ! ఇట్లు శెలవీయదగునా ? మీరిప్పట్ల దీర్చఁగల్గిన కార్యమెద్దియో సెలవీయ వేడుచుంటిని.

కాంతు॥ కలికీ ! నీతండ్రి వృద్ధుడగుటచే రాజ్యభారము మోయజాల కుండెనని బల్కితివిగదా ! గాన ప్రస్తుతమందీరాజ్యభారమునకు నాయకుఁడనై ప్రజాపాలనముఁజేసెదను గాని యారుమాసముల వరకు నినుఁ బరిణయమాడఁజాల.

చంద్ర॥ కారణముశలవీయ వేడెద.

కాంతు॥ ఏమనిచెప్పుదును ప్రియకాంతావియోగము సంభవించుటం జేసి యీాగడువుఁ జెప్పితిని.

చంద్ర॥ కాంతావియోగము మీాకెట్లుగల్గె?

కాంతు॥ కాలవశమున ఘోరాటవులఁద్రిమ్మరుచుండనందు ప్రియకాంతనుఁ గోల్పోయి యెందైన నున్నజాడ కనుగొందమని యిట్లు ద్రిమ్మరుచుంటి. కానిమ్ము నీకోర్కెదీర్చ రాజ్యపాలన జేయుచు నిందేయుండి నాకాంతను నెమకఁదగు వారిఁబనిచెద.

చంద్ర॥ చిత్తము తమదయ

చెలి॥ అమ్మా! చంద్రరేఖా!చాల జాగైనది రమ్మువోవుదము.

చంద్ర॥ ఆర్యా ! పురమునకుఁ దయసేయుడు.

కాంతు॥ మంచిది పోదము

చంద్ర॥ రండుపోదము. (అందరు నిష్క్రమింతురు)

[యవనికజారును]

తృతీయరంగము—రాజాస్థానము.

---

[ప్రవేశము: కాంతుడు ఆసీనుడై]

రాగావతారసీసము.

ఆహా ! యేమినాగతి?

సీ. శంకరాభరణంబు • జగతిభారముదాల్చు

రీతి భూభారమే • రీతిమోతు?

మోహనాకారనీ • ముద్దుమోమునుజూచు
భాగ్యమెప్పటికి • లభ్యంబుగల్గు?
భూపాలచంద్రయా • పాపపువిధియష్ట
కష్టముల్ పాల్ జేసె • గాదెనన్ను?
కన్నడయేల ? నకా • గాచిరక్షించుట
కిది మంచిసమయ • మికేల జాగు?
గీ. తోడివారలుజాల సం • తోషవార్ధి
నోలలాడుచునుండిరి • యోసరలిక
నోలిమిక మీపదంబుల • నోలగించు
భాగ్యమబ్బునో లేదో ? యీపాపికింక.

ఆహా ! నేనెట్టి నిర్భాగ్యురాలను ? పడరాని యిడుములం బడి నేటికి కపటవేషధారినై కాంతుండనుపేర కాలము గడుపుచుంటి. నా కపట కృత్యమెఱుంగక చంద్రరేఖ తన్నువివాహమాడుమని బల్కుచున్నది. ఆమె సుందర వదనారవిందముగాంచి నపుడెల్ల లజ్జించుచుంటి నేఁజెప్పిన గడువు సైతము తుదముట్టవచ్చినది. నాప్రాణకాంతుని జూడ యెందునుఁ గాన్పింపదయ్యె, ఇంకనేనేమిసేయుదాన? నాకింక దిక్కెయ్యది ?

ఓలక్ష్మీవల్లభా ! లోకనాయకా ! ఆర్తజనశరణ్యా ! ఇంకనా నాథుని నాకుంజూపకున్న నీప్రాణములంబాయుదాన. ఓజనార్దనా! కంసమర్దనా ! పతిభిక్షపెట్టినన్ను రక్షింపుమా గరుడసైంధవా ! వైకుంఠవాసా ! దిక్కులేని నాయట్టి దీనురాండ్రకు నీవేగదాదిక్కు? పుండరీకాక్షా ! యింకరక్షింపుము. [చూచి] ఎవడురా !

[ప్రవేశము, సేవకుడు]

అయ్యా ! సేవకుడు

కాంతు॥ ఓరీ ! నీవింక కారాగృహముచెంతకుజనియాకారాగారకుడ్యముపై వ్రాసిన చిత్రపటముఁజూచి యెవ్వరైనను దుఃఖించినను

మోహించినను ఏకదృష్టినఁజూచినను వారినెల్లర కారాగృహమునందుంచుము. ఇదియే నాయాజ్ఞ! జాగ్రత. మరచితివి ఎవ్వరేని మానివేషధారులువచ్చిన వారినిసన్మానించి యుచితాసన మొసంగుము.

సేవ॥ చిత్తము. (నిష్క్రమించును)

కాంతు॥ నేనించుకంత విశ్రాంతిఁ జెందబోయెద.

[నిష్క్రమించును. యవనికజారును]

——;o;——

## తృతీయరంగము-కారాగృహము.

[ప్రవేశము: సేవకుడు.] (ఖడ్గహస్తుడై)

రాజులయెడ సేవకావృత్తి మిగుల కష్టతరము "కోపమువచ్చిన కొరికి చంపుదురు. లేనిచో నాకిచంపుదురు." యెట్లైననుచావే? ఆజ్ఞ,"ఈచిత్రపటముచూచి దుఃఖించువారికారాగృహమందుంచ"మని ఇచటికి కసేకులు వచ్చిరిగాని యీపటమునుఁ జూచి దుఃఖించినవాఁడొక్కఁడును లేడు. ఇందుఁ గాఁచియుండలేక. చచ్చిపోవుచున్నాఁడ ఇందీపటము నాచావుకొరకే వ్రాసినారు. ఇందు నిందరుండ గావలికి నేనే దొరకితినా?

——;o;——

(ప్రవేశము:ఉత్తమశీలుఁడు)

[అనుబంధము 18]

(చిత్రపటముంగాంచి) హా! తరుణీ! కాంతామతీ! మోసపోయితినే?

సేవ॥ ఎవరునీవు?

ఉత్త॥ నేనువైశ్యుడను.

సేవ॥ ఈపటముఁజూచి ఏలదుఃఖించెదవు?

ఉత్త. అయ్యో! ఈమెయిప్పుడెందున్నయది?

సేవ॥ కావలెనా? చూపెదరమ్ము. (అని కారాగృహమందుంచును)

[ప్రవేశము: దుష్టబుద్ధి.]
(అనుబంధము 19)

(చిత్రపటముఁగాంచి) హా! కాంతా!

సేవ॥ ఓయీ! నీవెవ్వఁడవు?

దుష్ట॥ నేను క్షత్రియుండను.

సేవ॥ యీపటముఁజూచి యేల దుఃఖించెదవు?

దుష్ట॥ ఆమె నాభార్య. అందుచేత.

సేవ॥ ఐన యామె నీకిప్పుడు కావలెనా?

దుష్ట॥ అయ్యా! యేఁదున్నది? కావలెను. చూపితివేని నీకు పారితోషిక మొసంగెద.

సేవ॥ అట్లైన రమ్ము. (కారాగృహమందుంచును)

—;o;—

[ప్రవేశము: దొంగ.]
(అనుబంధము 20)

ఆ. గంతా! గంతా!

సేవ॥ ఓరీ! ఏల యేడ్చెదవు?

దొంగ॥ గంత. నాగంత.

సేవ॥ నీకాగంత కావలెనా?

దొంగ॥ ఆ. కావాల. ఏదీగంత.

సేవ॥ ఐన రమ్ము. (అని కారాగృహమందుంచును.)

---

(ప్రవేశము: రాజపుత్రులు.)
(అనుబంధము 21)

(చిత్రపటముంగాంచి) హా! తరుణీ! మమ్ము మోసముఁజేసి యెందుంటివి?

సేవ॥ ఎవరుమీరు?

1, 2 మేము రాచబిడ్డలము.

సేవ॥ ఈపటముఁజూచి యేల దుఃఖించెదరు?

1, 2 మాకీకాంతగావలెను ఎందుకన్నది ?
సేవ॥ నిజముగగావలెనా ?
1, 2 కావలెను.
సేవ॥ ఐనరండు. (అని కారాగృహమందుంచును)
[ప్రవేశము; ప్రతాపసేనుఁడు, సన్యాసివేషమున]
(అనుబంధము 22)
హా ! ప్రాణేశ్వరీ ! ఎందుంటివి ? [చిత్రపటముంజూచి దుఃఖించును]
సేవ॥ యతికులేంద్రా! నమస్కారము.ఇయ్యుచితాసన మలంకరింపుఁడు.
ప్రతా॥ మంచిది. (కూర్చుండును)
[ప్రవేశము: కాంతుఁడు] (ఒకవైపున)
కాంతు॥ (స్వ) ఈతని రూపలావణ్యములంజూడ నాకాంతునివలె గన్పట్టుచున్నాఁడు. నిదానించిన సర్వముఁదెలియుంపకును. [ప్ర] తాపసేంద్రా ! వందనములు. ఇంచుకవిశ్రాంతిఁజెందుఁడు. సేవకా! ఈ పటముంజూచి దుఃఖించినవారి నెల్ల కారాగృహమందుంచితివా ? (ఆసీనుండగును)
సేవ॥ చిత్తము.
కాంతు॥ ఐన వాండ్రవరుసగఁ దోడితెమ్ము. విచారించెద.
సేవ॥ చిత్తము. (ఉత్తమశీలుని వెలుపలకుఁదీసుకొనివచ్చును)
కాంతు॥ ఓయీ ! నీవెవ్వఁడవు ?
ఉత్త॥ నేను శేరివంశజుఁడను.
కాంతు॥ ఈపటముంజూచి దుఃఖించినకారణమేమి?
ఉత్త॥ అయ్యా ! ఈమె నరణ్యమున నొక సేవకుఁడు విడిచిపోవుచుండ వానికి నేకొంతధనమిచ్చి యీయమనుగొంటిని. పిదప నన్నుం గూడుమని యీమెను నేనిర్బంధించ యీమహాతల్లి నాకుబుద్ధి వచ్చునట్లు నీతులఁజెప్పినది. అంతనే నజ్ఞానమును విడిచి సుజ్ఞానముధరించి అమ్మా! నాధనమెట్లు వచ్చునని ప్రార్థింపయీమె వ్రేలినుండు యంగుళీయక మొకటిచ్చి దీని విక్రయించుకొమ్మ

ని జెప్పినది. అంత దానిం గైకొని యొకరాజుసన్నిధికిం దీసికొని
పోవ నాతఁడది గ్రహించి నాకు ధనమీయకయే బారదోలె.
అంతనేను నాద్రవ్యము పోయెగదాయని మతిభ్రష్టుఁడనై జరిం
చుచు నేటికీపురముఁ జేరితిని. యిందాతల్లి రూపపటంబుగన్నపుడఁ
జూచి దుఃఖించితిని. అంతియెగాని వేరేమియు నేనెఱుంగ.

కాంతు॥ మంచిది. అవలనుండుము. యెతికులేంద్రా! ఇందు మీ యభి
ప్రాయ మెట్లుగానుండె? సెలవొసంగుఁడు.

వ్రతా॥ ఈతఁడు ద్రవ్యముఁగోల్పోవుటచే మతిభ్రష్టుఁడనైతినని బల్కు
చుండె. ఆట్లనే జరుగవచ్చునని నాకుందోచినది. మరియు. ఆ
మెకును యీతనికిని యేమియు సంబంధముగల్గినట్లు నాకుఁదో
చకున్నయది.

కాంతు॥ మంచిది. ఓయీ నీవావలనుండుము. సేవకా! తర్వాత వానిం
దోడ్కొనిరమ్ము.

[సేవకుఁడు దుష్టబుద్ధిని వెలుపలకుఁ దీసికొనివచ్చును]

కాంతు॥ ఓయీ! నీవెవ్వఁడవు?

దుష్ట॥ నేను రాజకులోత్తముఁడ.

కాంతు॥ నీవు రాజకులోత్తముఁడవా? ఐన నీవాపటముంగాంచి దుః
ఖించనేల?

దుష్ట॥ ఆమె నాభార్య గాన:—

కాంతు॥ (కోపముతో) నీచా! నిజముగ ని భార్యయేనా? సత్యముఁ
జెప్పుము. లేకున్న శిక్షింపఁబడుదువు. ఆమె యిందేగలదు. నీ
వసత్యముఁబల్కితివేని యామెనిందురావించి నిజమారసి శిక్షిం
చెద. జాగ్రత. నిజముగ్గడింపుము. క్షమింపఁబడుదువు.

దుష్ట॥ (భయముతో) అయ్యా నాభార్యగాదు. ఆమె నాపట్టణమునకు
వచ్చినది. అంత నేనామెను నిర్బంధించి నాకోర్కెఁదీర్చుమం
టిని. అంత యామె యిట్లుబల్కినది. "నేను గౌరీవ్రతము సల్ప
వలెను అదినల్పుట కారుమాసముల యారుదినములుజరుగును

అందుల కనేక దానము లీయవలయు. దానికగు వ్యయము నీ వొనర్చిన నీకేలభించెద"నని చెప్ప నేనందులకు నాబొక్కసమందుగల ధనమంతయు వెచ్చించితి. పదపడి రాజ్యముసైత మితరరాజుల యాధీనముఁజేసి ధనముఁగొని తెచ్చి యామెకడ కంపుచుంటిని. యిట్లారుమాసములు జరిగినవి తరువాతినాకడద్రవ్యము సాంతమైనది. ఆమె నాయారుదినములు జరుగక మున్నె యెవ్వండో పారిపోయినది. ఎట్లైన నామెదర్శనమైనఁజేను కొందమని రాజ్యభ్రష్టుఁడనై యిట్లుద్రిమ్మరుచుంటిని. ఇందామె రూపపటంబుగన్నడ దానింజూచి దుఃఖించితిని. అంతియె గాని వేరేమియు నేనెఱుంగ.

కాంతు॥ ఆర్యా! ఇందుమీ యభిమతమేమి? సెలవొసగుఁడు.

ప్రతా॥ ఈతఁడును రాజ్యమును ద్రవ్యమునుఁ గోల్పోవుటచే నిలువనీడ లేక యిట్లుగా ద్రిమ్మరుచు వచ్చెనని నాయభిప్రాయము.

కాంతు॥ ఈతని విషయమై మీకేమియు ననుమానము లేదుకదా?.

ప్రతా॥ ఈతనియెడ దోషమున్నట్లు నాకుఁదోచుట లేదు.

కాంతు॥ మంచిది. ఓయీ నీవావలకుంబొమ్ము. సేవకా! తరువాతివానిఁదోడ్కొనిరమ్ము.

(సేవకుఁడు దొంగను వెలుపలకుఁ దీసికొనివచ్చును.)

కాంతు॥ ఓరీ! నీవెవ్వఁడవు?

దొంగ॥ నేనా? మచ్చేటగాణ్ణి.

కాంతు॥ అనగానేమి?

దొంగ॥ దొంగతనమే?

కాంతు॥ నీవీ పటముఁజూచి యేడ్చినదెందులకు?

దొంగ॥ యిదే. నేనే. దొంగతనానికి పోయేతలికె మేడమింద కూకొని ప్యాణేశా! అన్నది. అమోాయిన్నేను ఊఁ. అన్నా. అమోాయిని పైనించి దిగొచ్చింది అప్పుడునేను మెల్లెంగఅడీయికిదోవతీశా

ఆమోాయిని అది నాయనకే వత్తుండదది. అట్టపోయి అట్ట పోయి అడియి మద్దెకు తీసికెల్లే. ఆమోాయిని నన్ను పెళ్ళిచేసు కోమని చదలకుండ అడ్డంపొయ్యా. ఆమోాయిని యేందేందో చానా చెప్పింది. అయెన్ని నాకు తెల్దు పెళ్ళిసేసు కుంటావా లేదా ? అంటా దగ్గిరపోయా ఆమోాని:—

కాంతు॥ ఛీ ; వెధవా ! ఏంమోాయిని నీమొఖంమోాయిని.

దొంగ॥ ఆ. నీమొకంమోాయిని;—

కాంతు॥ ఛీ ! బుద్ధిహీనుడా ! శరీరముదగ్గరనుంచుకొని మాట్లాడుము

దొంగ॥ మరిగట్లైతెఅమోాయిని:- మరిసిపొయ్యాకూసేపుందు

కాంతు॥ ఊ. దగ్గరకుపొయినావు.

దొంగ॥ మరిగట్లే, ఆమోాయిని నీకుమంచి జెరుసుల్లేవు అయ్యోసుకుని రామని సెప్పింది. ఆమోాయిని నేను మాయింటికెల్లి యీా జెరుసులేసుకొని మావాళ్ళందరిని బిల్చుకొని బుక్కాయి గిక్కాయితీసుకొని ఆడికొచ్చేతల్కి ఆ దేవుండదది? ఆమోాయిని:-

కాంతు॥ (దెబ్బకొట్టి) ఛీ వెధవా ! దబ్బునఁదేల్చి చెప్పుము.

దొంగ॥ ఆమోాయిని మావాళ్ళంతానన్ను దొంగెదవా ! దొంగ మా టలు సెప్తావా మాకని తలాక దెబ్బొయేశారు. ఆమోాయిని నేను యేమత్తు అడియినిబడి వత్తావుండా. యెట్టైన దాన్ని పెళ్ళిసేసుకోవాలనె వొచ్చొచ్చి ఆగోడమింద దానిబొమ్మ కనిపిచ్చేతలికి అమోాయిని యేమపొచ్చి బోర్నేడ్సేతలిక యీా యదవలొచ్చి నన్నుగెట్టిగా పట్టుకొని నీకు దాన్ని యిత్తాం రామనిసెప్పి ఆమోాయిని కిటికీలో కూకుండ బెట్టేరు. అందు లో యీాళ్ళంతా వుండారు. ఆమోాయిని:—

కాంతు॥ ఓరీ ! తలనొచ్చుచున్నది గదరా ! యింకమాట్లాడక ఆవ లుండుము. పొమ్ము.

దొంగ॥ అంతా సెప్పొద్దుమరి. ఆమోాయిని:—

**కాంతు॥** (దెబ్బగొట్టి) ఆవలకుంబొమ్ము జాగ్రత (ప్రతాపసేనుం జూచి) అయ్యా! వీనినిగూర్చి యేమిజెప్పెదరు ?

**వ్రితా॥** వీఁడు చోరుడగుటచే ద్రవ్యాపేక్షవలన నిట్లు మాయలం బన్నెగాని వీడామెయందేమియు కపటమవలంభించి యున్నట్లు నాకుఁదోచకున్నది.

**కాంతు॥** మంచిది. ఓరీ! నీవావలకుంబొమ్ము. సేవకా! తరువాతవానిఁ దెమ్ము.

(సేవకుడు రాజకుమారుల వెలుపలికిఁ దీసుకొనివచ్చెను.)

**కాంతు॥** మీరెవ్వరు ?

**1, 2** మేము రాచబిడ్డలము.

**కాంతు॥** ఇందేలవచ్చితిరి ?

**1, 2** అయ్యా! కొన్నిమాసములక్రిందట మేమిరువురము మృగయా వినోదార్థమై కానన భూమికేగితిమి అందొక తరుణింగాంచి ఆమెపై మోహముగల్గి యామెను నిర్బంధించితిమి ? కాని యాబిడమాకెన్ని యోనీతులు దెల్పినది. మేమామెనీతులువిశ్వసింపక యామెబోవు మార్గమునిరోధించితిమి అంతి నాయమ యిట్లుబల్కినది. "రాజకుమారులారా! నేనొక్కటిఁ దెల్పెదను వినుడు. మీ యుడుపులిందు విడచిపెట్టుడు" అన మే మట్లు జేసితిమి.

**కాంతు॥** మంచియుక్తిబన్నినదే పిమ్మట ?

**1, 2** పిమ్మట యీశరమును విసరివేసెదను దానిముందు తెచ్చిన వాని బెండ్లాడెదనని బల్కి శరమును వేగముగ విసరి వేసెను అంత మేమా శరము కొరకై బర్వులిడి శరముం గైకొని వచ్చుసరికి యామె మాయుడుపులను రెండవ శరమునుగైకొని యెందోజనినది. మేమందులకుఁగినిసి దుస్తులఁగోల్పోయి పురముఁ జేరుటకన్న యాకాంత యెందుగలదో నెమకి ప్రార్థించిమరల దుస్తులగైకొనుట మేలనదలఁచి మార్గముఁబట్టి యి

చ్చటికి జేరితిమి యిందామె రూపపటముగాంచి దుఃఖించితిమి అంతమమ్ము కారాగారవాసులుగఁ జేసిరి. యింతియేగాని వేరెరుంగము.

కాంతు॥ మంచిది. అయ్యా! ఇందులకు మీాయభిప్రాయమేమి ?

ప్రతా॥ తొలుతవీరు మోహముచే దుష్కార్యమునకుఁ బాలడ్పియు కపటోపాయమున నా కాంత దుస్సులఁ గైకొనిపోవుటచే కాంత లభింపకున్నను దుస్తులైన లభించిన మేలనిదలచి యిట్లుగా యీాకాంతకై దిరిమ్మరుచున్నట్లు స్పష్టమైనది. కాని వీరికిని యీాకాంతకును సంబంధ మేమియు లేదని తేటబడినది.

కాంతు॥ మంచిది. సంతసించితిని.

ఓయీా ! బుద్ధిహీనులారా ! ధనతను మదాంధతచే కన్నుమిన్నుఁగానక పిన్నపెద్దలని యెంచక పరనారులని దలఁచక విఱ్ఱవీగకుఁడు. మీా పురమున కివ్వరైన విధివశమ్మున వచ్చిన వారిని నిర్బంధించి పాపమార్జింపక సద్బుద్ధిగల్గి మెలంగుఁడు. పిన్నతనపు చేష్టలుమానుఁడు. కీర్తిసంపాదింపుఁడు. భరతమాతను దుఃఖపెట్టకుఁడు (ప్రతాపసేనునింజూచి) అయ్యా ! వీండ్రవలన నేలోపము లేదని సెలవిచ్చినారా ?

ప్రతా॥ ఏలోపమును లేదు

కాంతు॥ ఇంక వీరికి సెలవీయఁదగునా !

ప్రతా॥ ఆ, నిరాటంకముగ.

కాంతు॥ మంచిది. అయ్యా! తొలుతకాంతుని గోల్పోయి యిట్టి కష్టములందిన కాంతను మరల ప్రాణకాంతుఁడంగీకరింప నేమైనసందియముండునా? ఉండినఁదెల్పుడు ?

ప్రతా॥ లోపమేమియు లేక దన పాతివ్రత్యమునుఁ గాపాడుకొనిన కాంత నేల నంగీకరింపఁడు. ఆమె యేల యంగీకరింపఁబడదు ?

కాంతు॥ నాథా! నిద్రాహారంబులులేక ఇన్నికష్టములంది యీాపురముఁ జేరి పురుషవేషమున కాలము గడుపుచున్న నిర్భాగ్యురాలగు కాంతామతిని నేనే. యింక కరుణింపుఁడు.

(అనుబంధము 23.) (కాళ్లపై (బడును.)

ప్రతా॥ (ఆశ్చర్యముగ) తన్వీ ! నిజముగ నీవు కాంతామతివా?

కాంతు॥ నాథా! తమ సెలవయ్యేనేని పూర్వరూపముం జూపెద. (స్త్రీరూపముజూపును)

[ప్రవేశము: చంద్రరేఖ, చెలికత్తె.] (ఒకవైపున)

కాంతా॥ సోదరీ ! ఇట్లాశ్చర్యమునం జూచెదవేమి ? ఇంతకాలము నుండియు

గీ. పురుషరూపంబు ధరియించి ♦ పుడమినేలి
కాంతుండను పేరం బరగి నీ ♦ స్వాంతమునకు
సంతసముగూర్చి యుంటిబల్ ♦ వింతగాను
చంద్రరేఖ ! సహోదరీ ! ♦ సంగతిదియె.

నేనారుమాసంబులు గడువుచెప్పిన దీమహానీయుండగు నాప్రియ కాంతునికొరకు. మరియు నేనిదివరకుం బడిన కష్టములెల్ల నా చేనివ్వాను విచారింపంబడిన పంచమహాపాతకులననొవ్వ నీయైదుగురివలననే. పీండ్రంజూచితివా ? నీచాత్ములు.

ప్రతా॥ ప్రియకాంతా ! కాంతామతీ!

చం. కలికిరో! నీగుణంబులను ♦ గన్గొననేరక వేశ్యమాటలన్
యిలనిజమంచునమ్మి నిను ♦ నీడ్చితి కానకు మందబుద్ధినై
భళి! యన లోకమెల్లరును ♦ బాగుగ రాజ్యము నేలి దుష్టులన్
లలనరో! శిక్షజేసితివి ♦ లక్షణవంతులుజూచి మెచ్చగన్.

ప్రియా! నేనొర్చిన దుష్కార్యముల మనమునం దెంచక నన్నుం గావుము.

కాంతా॥ నాథా! ఇందు మీరేమిజేసితిరి ? ఇదియంతయు విధివశమున జరిగినది. యిందులకు మీరు చింతింపకుండు. మరియు నీకోమలాంగి మీమృదుకరపల్లవముంబట్టి సుఖింప మీకొరకై నిరీక్షించుచున్నది. ఈమెం జేపట్టి కృతార్థులం జేయ ప్రార్థించుచుంటిని.

చంద్ర॥ ఆర్యా ! నన్నును యీకళింగరాజ్యలక్ష్మిని జేపట్టి సుఖింప
వేయుచున్నదాన. (నమస్కరించును)

ప్రతా॥ రామామణీ ! నీకోర్కె నెరవేర్చ యట్లనే యంగీకరించెద
లెమ్ము.

కాంతా॥ నాథా ! శుభశ్యశీఘ్రమ్మనునట్లిప్పుడే శుభముహూర్తముఁ
గూడ దాపుజేరినది గావున యీకజాగు సేయకుఁడు సేవకా!

(ప్రవేశము: సేవకుఁడు)

సేవ॥ శలవు

కాంతా॥ సత్వరంబుఁజని రెండుచిత్రాసనములం దెమ్ము

సేవ॥ చిత్తము [నిష్క్రమించును.]

(పునఃప్రవేశము: సేవకుడుకుర్చీలతో)

కాంతా॥ నూతన దంపతులారా ! ఇయ్యాసనములలంకరింపుఁడు

ప్రతా॥ }
చంద్ర॥ } [వాటిపై గూర్చుందురు]

కాంతా॥ (కర్పూరము వెలిగించి)

మంగళము

మానినులు భూస్థలిని • మాన్యతగఁడించి ప్రియ
మంపులవచోమృతము లొల్కగ

బూనుకొని భర్తలకు • బూజంగాగిఁజేసియిల
పుణ్యవతులయ్యేదరుగాతగ

జానలను బూరుషులు • సంభ్రమముగఁగై కొనియు
• జక్కగ సుఖించెదరుగాతగ

మానవతులై నరతి • మ్మారసములిద్దరకు
మంగళము ! మంగళమహాశ్రీ

[యవనికజారును]

సంపూర్ణము.

-------

గీ. ధాత్రియందు భరద్వాజ • గోత్రయుతుఁడు
కరముగూడూరువంశ్యుండు • ఘనయశుండు
మల్లయార్యునిపౌత్రుండు • పూన్యతముఁడు
అరయ వేంకటశివకవి • కాత్మజుండు
నిచ్చదీనిరచించెఁగో • టీశ్వరుండు.

—;o;—



# కాంతామతి

## అనుబంధము

కాంచ॥ 1 హిందుస్తానితోడి-ఏకతాళము

ఆహాహా! యీజగతికిఁజూడగ వేశ్యలె ధీరులుగా? ॥ఆ॥
ముదంబుజూపగ=మదంబుదీయఁగ=యదందలచిచూడంగ ॥త॥
ధనములాగగా తగువారెవరిల!=తగినవారలే వేశ్యలుగా?
ఈయిలతగినవారలే వేశ్యలుగా? యీయిల తగినవారలే వేశ్య
లుగా? వేషముల్=భాషలన్ = వేసియున్ = జాలగా ॥ఆ॥

ప్రతా॥ 2 హిందుస్తానికాఫీ-ఏకతాళము

కలికీ మిటారీ। కాయజు కటారీ!
అలుకాలేల నీకు? = బలుకాకనాతో? ॥క॥
కాంచనమాలారో! = కను కోపమేలనే!
కాయాజుబారికి తాళాగజాల = మోహనాంగిరో! వేడెదఁజాల
నఁబాయుటనీకిదిమేల? = గుణసీల = యిదిమేల = వినుబాల ॥క॥

కాంత॥ 3 డైలాగ్.

వినువిను వినుసీనై వాహిశమున్ = వినియుజేసికో = వేశ్యనువీడిన్
వినకయున్నవిపు = జెడకపోవుసుమి = వేదవాక్యమిదివినుమింకన్॥

ప్రతా॥ చాలు చాలునీ = సంగతిదెలసెన్ = యేలబల్కెదవు? గురు
వనినిన్నీ వేళకాచితిని = వెడగుమానుమిక = పెరలుబల్కనిటు
నలుకకుందునే॥

వేశ్యలు॥ 4. పాట. డ్యాన్సు.

మహారాజ సుగుణాధార = మమ్ముబ్రోవుసుమశరీర
గావన్ = కరుణన్ = వేగన్ = మముగను (మా) ॥మ॥
నీసరియెవరీ = భూస్థలిగనుగొన
భాసురగాత్రా! = పరమపవిత్రా!
వాసిగన్ ॥ చేకొనన్ ॥ దగునికన్ ॥ నీమదిన్ ॥ రయమున ॥మ॥
మాదగుకోర్కెల = మహిదీర్చియువడి
సాదరముగమము=సాకుము వేగన్ = జే గా దా ధా రా ॥మ॥

కాంత॥ 5 హిం॥ తోడి - రూపకతాళము

ఏమిసేతు? దైవఘటన = యెందుబోదునేనిక...
కామితార్థదైవరాయ = కనియుబ్రోవవా...
నేరమేమిజేసియుంటినో? = నే నెఱుంగనే...
ధీరస్వాంత! ప్రాణకాంత! = దీననేలిబ్రోవుమా...
కారాగార మందునుంచుట = కారణంబ దేమి హా...
నేరమున్న వేరుశిక్ష = నేర్పరించ రాదొ కో...

కాంచ॥ 6 బేహాగ్ రాగము-ఏక తాళము

ఆహా! మామర్మముల్ దెలియ నెవ్వారితరమౌనిల? ॥ఆ॥
ఇలమోహాంబులో = పలు వేసంబులన్ = వడివేయుచునన్
ధనమార్జించగన్ = కాముకులముంచుచును = కాలంబుగడపుదుం
గదా: ॥ఆ॥

కాంతా॥ 7 హిం॥తోడి-రూపక తాళము

నాథా! గహనబాథా! సైపగలేనే? ॥నా॥
చెరసాలలోనన్ను = జేర్చి బాధించితౌ
పరగ వనములకంప -భావ్యామనీకిది ॥నా॥
ఎటుబోదు నేనింక? = యువరింకదిక్కెయ్యో!
కిటకిట! నాకిల్లు = గల్గునంచెరుగానె ॥నా॥
తల్లిదండ్రులునమ్మి = యుల్లముహర్షింప
కల్లమాటలఁదెల్పి = నిల్లాలికీపాట్లు! ॥నా॥

ఉత్త॥ జైలాగ్.

మోహముఁదీర్చావెందుబోయెదవే? కల్కిమిటారీ! కంతునికేళిగారి॥మో॥
కుందరినా! యిందువదనా! మందగమనా! వినగదే?
సుందరీ! నీ = విభువఁజాల = పొందకుండ = నేసిటే॥మో॥

కాంతా॥ చాల్ చాల్ నీచా! = సరసముదెలరే = సఖులను గో
రగదగునా ఛీ
పరనారీ! మణులగోరా = దఃరితమా = నరకినూ = దెలియ
వా? ॥చాల్॥

ఉత్త॥ దురితమునరకమదెందుఁగలదె?॥ దూరమునుండెడవేలనే? బాలా!

కాంతా॥ సరసుల కదియుట = సరిగున దెలియదా = చాల్ చాల్
ఛీ పో = సరగున నీచా!

ఉత్త॥ సరసుడనేనే=విసమలేలను? = సగగునచంతకు రా.రా.రా.

కాంతా॥ దురితముకామ్యము = దూరమునుండుమ = దుష్టుడ ఛీ ఛీపో

9 జైలాగ్.

దుష్ట॥ చాల్ చాల్ నారీ! యోరాజాకుమారీ
కాంతా॥ ఏలనఛీపోరా నన్నిఁక కోరతీరా
దుష్ట॥ సఖ వినవా?
కాంతా॥ ఓరి నీవుమనవా?
దుష్ట॥ పరహింసలు = కాంతరో పాపముగాదా? యిల

కాంతా॥ పరనారీని=గోరుట=పాపముగాద ? ధర
దుష్ట॥ పరసఖివౌదువా ?
కాంతా॥ కూ్రరనీవెరుగవా ?
దుష్ట॥ సరి సరి కాంతా! సరసకురావా!
కాంతా॥ పరసమదేరా! సరగునపోరా
దుష్ట॥ నారీ! వయ్యారీ! చిన్నారీ! మిరారీ!
కాంతా॥ యేలనుఘీపోరా ! నన్నిటు కోరతీరా !
దుష్ట॥ చాల్ చాల్ నారీ ! యోరాజాకుమారీ !
ప్రతా॥ 10. బేహాగ్ రాగము-ఆదితాళము.
వేశ్యలఁగూడుటవెతనకునండీ = వెడగుమానుడిక = విటులందరుని॰వే
మోహాముఁజూపించి = ముద్దులఁ దిసిపించి = ముంచియు తేల్చ
రుగా ? విటులన్ = ముంచియు తేల్చరుగా ? ॰వే॰
మాన్యములమ్మించు = రాజ్యములమ్మించు = యిల్లూ వాకిలీ
సున్నా = వీటులకుయిల్లూ వాకిలీ సున్నా ॰వే॰
దాసునిగాజేసి = వాసియుఁదెగగోసి = వరుసగ క్షౌరముఁజేసి
యుర్ = వేశ్యల్ వరుసగక్షౌరముఁజేయుర్ ॰వే॰

కాంచ॥ 11- 10 వ పాటయే

కాంతా॥ 12 ఫీలు-ఏకతాళము.

కరుణజూపవా ? నాథా! వైరివినాశన
ధరణిపాల వందనీయ=దరుణిబ్రోవవా! ॰క॰
కాంతామతికీకష్టముల్
కడతేర్పరావ ? నాథా !
కష్టదశలోననుంటి బ్రోవరావే. ॰క॰

ప్రతా॥ 13 హిం॥ తోడి—ఆటతాళము.

అయ్యోనాకాంతామణి! కాంతామణి ! పోయెను హాహా! ॥అ॥
పాపూడానే నిల

పడరాని పాట్లెన్నొ పడ్డికిడియు
పంపియుంటిని కానకు పాపమనక
బాల యేలీల నుండెనో? కానలందు
వేశ్యచే నిట్లుగల్గెగా వెతలునాకు. ॥అయ్యో॥

కాంతా॥ 14. హిం॥ తోడి ఏకతాళము.

అకటా! యెటుదోచదుగా ? యీగహనామునజన •అ•
నాథా! యీగతి = బాధలనొందెను = నగనిబ్రోవవుగా?
మా న స ము న •అ•
కౄరులునగని = మారునిబారికి = నారికుకుందుచునూ =
• ద రి జే ర గ నా •క•
మార శరీరా = మహిగుత విచారా = మనగలనే ? ధీరా =
గ న క ని ల •అ•

1-2 రాజకుమారులు. 15. జైలాగ్

1,రాజ॥ చెలియసీదు కౌగిలొసగి = చెంతఁజేర్పరాగదే ? •చె•
కలికీ! యీమసుతూపుల = కింను తాళ జాల నింక
చలమేలను ? ననుచేకొను = జలజానన ! మందగమన ! •చె•

కాంతా॥ చాలునుపోమ్మా ! నీసరసమెల్లఁదెలిసె సుమా
పరతరుణుల నిటుఁగోరగ = పాపమనుచుఁదలపవా ? •చా•

2,రాజ॥ చానయిటులఁబల్కనీకు = సరసముగునెదలపుమా?
కానవెనున్నీధరగల = కాముకోటిదన్నినట్టి
మానినీచరితమెందు = మహిని వినవె కామినీ! •చా•

కాంతా॥ కానవెవరు లేరటంచునెంచియు = మానసమున అనుమాన
మువదలియు పాత్రాపాత్ర విచారణసల్పక = పల్కుచుంటి
వేమంచునునిన్నిక = ఏమనిప్రేలితిమూఘాత్ముడా మానవాధ
మాధముడా ఛీ.ఛీ. •ఏ•

చంద్ర॥ 16 జైలాగ్

కొమ్మరఘుఁ కుఘుంమ్మను = తుమ్మెదల రొదకిని

నిమ్మళించలేనెమది = యాహాహా
చూడచూడనిటు చోద్యమయ్యెనకు = సుందరాంగి యిదివిన
కనగఁ యింపుగాఁ = సొంపుగాఁ = పెంపుగాఁ = అహా
యంచనుఁజూడుము యీలతలఁ

చెలి॥ కీరశారికా కిలకిల రవములు = కీరవాణిబల్ తీరుగ నుండెను,
కోటిమన్మథుఁడు = జేరిబాణముల = నారిమణుల పయి = నడ
పెనోయనగా?
కూయసాగెన్ = కుతుకముతోడన్ =
చందురువదనా! సుందరనయనా! ॥కీ॥

చంద్ర॥ ఈయుద్యానము = యింపుగనుండెన్ = గుండురాలిరో! యి
ది నిపుణనుమా?
విరులసొంపు = తరులపెంపు = నారులకింపు = బాలురసొంపు॥

చంద్ర॥ 17 హిం॥ తోడి—ఏకతాళము.
ఆహాహా! యీయువకునిసరియగు = పురుషునిగంటిమ వహ్వా
వహ్వా!
కంతు జయంతు వసంతుల మీఁగెలెఁ = కాంతరో! వీనిపై =
గలెదు కాంక్షల్ ॥ఆ॥
పూర్ణిమచంద్రుని సోలెడిమోముఁ = భుజములు గిరులన బో
లెన్ గనగన్.
నిగ్రహమునెంచఁ = గ్రీలనుమించెఁ = కనులన గాంచఁ =
కమలములనగన్ ॥ఆ॥

ఉత్త॥ 18 ముఖారి—ఆదితాళము.
ఆహా! కామినీ! కనుపడవై...తివ?
కాసలా నిన్ను నే = కనికొనియుండితి
మానసా! నిన్నుఁగాంచ = చాలను నేడికి ॥ఆ॥

దుష్ట॥ 19 ముఖారి-ఆదితాళము.
ఆహా! కాంతరో! కనుపడవై...తివ?

రాజ్యముఁగోల్పోతి = రామరో! నిన్గని
వ్యాజముఁబన్నిటు = వ్యర్థుడనైతిగ ॥ ఆ ॥

దొంగ॥ 20 ముఖారి-ఆదితాళము

యాడపోతివే? (ఓ) ఆడమడిశా! యాడపోతివే?
పెళ్ళిసేసుకుంటాననీ = పారిపోతివే? ఆడమడిశా! ॥యా॥

1, 2 రాజకుమారులు. 21 ముఖారి-ఆదితాళము

ఆహా! మానినీ! కనుపడవై...తివ?
నమ్మకముతో మమ్ము = నమ్మింప రచి
కొమ్మరో! దుష్టుల = కొనిచనియుంటివె? ॥ ఆ ॥

పరితా॥ 22 ముఖారి-ఆదితాళము

హా! కాంతామతీ! కనుపడవై...తివ?
నిన్ను నేగోల్పోతి = నిముసములోననే
నన్ను తాంగిం! నే = నిన్నికఁగాంతునా? ॥ హా ॥

కాం॥ 23 మోహనరాగము-ఏకతాళము.

కరుణగాంచి=కనికరించి=బ్రోవుమా నాథా!
పడితి కష్టములెన్నో నేను=బనుకనేల? ప్రాణనాథ!
కడకుమిమ్ములఁ గాంచియుంటితి=కష్టములుఁ గట్టుబట్టి
క్రూరులచేఁబడి=కుందియున్ననన్
కృపచేఁగాంచియు= కూరిమినించియు ॥క॥



# పురూరవ.